**Results of Chandamama—Camlin Colouring Contest No. 13 (Telugu)**

*1st Prize:* M. Yugandhar, Madras-17. *2nd Prize:* J. Lakshmikumari, Nadakuduru. *3rd Prize:* K. Venkateswara Rao, Ghantasala. *Consolation Prizes:* B. Rajesh Babu, Visakhapatnam-530 001; P. V. Taruna Rao, Raichur; K. Vani, Visakhapatnam-530 001; S. Bhaskar Singh, Vijayawada-11. M. Srinivasa Rao, Srikakulam.

# ఫ్లాష్ వాడండి, చిరునవ్వులను చిందించండి.



## మీరిప్పుడు తాజాదనంతో చిరునవ్వు చిందించేందుకు కారణాలు :

**ఫ్లాష్ చిందించే తాజాదనం :**
ఫ్లాష్‌లోగల నీలపు పదార్థం నోటిలోని దుర్గంధాన్ని, క్షయకారకమైన పురుగులను దూరం చేస్తుంది.

**ఫ్లాష్ వల్ల ఆత్మవిశ్వాసం :**
ఫ్లాష్‌లో మీ దంతాలను, చిగుళ్ళనూ మరియు మీ నోటినంతనూ కాపాడేవన్నీ ఉన్నాయని మీరు తెలుసుకున్నందువల్ల వచ్చేదిది.

**ఫ్లాష్ యొక్క రుచి :**
అమ్మమ్మ...మురిపించేసే రుచి ..మరి కాసేపు బ్రష్ చేసుకోవాలనిపించేసే రుచి.

ఫ్లాష్ యొక్క అపూర్వగుణం నోటికంతటికీ రక్షణనిచ్చే తత్వం




# ఫ్లాష్
## టూత్ పేస్ట్

తాజాదనం చిందించే నీలపుపదార్థం గలది.

everest/80/FL/183-tl




# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

ఈ నెల బేతాళకథ [''వాత్సల్యం'']కు ఆధారం విజయసిన్హా రచన.

''పనికి రాని వస్తువులు'' అన్న కథలో గొప్ప సామాజిక నీతి ఉన్నది. మనం అందుబాటులో ఉన్న వస్తువుల విలువ గ్రహించలేం; వాటికి విలువ కల్పించలేం.

## అమరవాణి

పరాపవాదే బధిరః, పరచ్ఛిద్రే ష్వలోచనః,
పంగుః కర్మ స్వనార్యేషు, దుస్సంకల్పే ష్వచేతనః.

[ఇతరుల నిందల విషయంలో చెవిటి వాడూ, ఇతరుల తప్పులు చూడటంలో గుడ్డివాడూ, చెడుపనులు చెయ్యటంలో కుంటివాడూ, చెడ్డ ఆలోచనలు చెయ్యటంలో బుద్ధిలేని వాడూ సత్పురుషులు.]

సంపుటి 66 జూన్ '80 సంచిక 6

విడి ప్రతి : 1-50 : : సంవత్సర చందా : 18-00

CHITRA




బి. దుర్గాప్రసాద్, కవిటి.

ప్ర: మనస్సు ఎల్లవేళలా భూతమూ, భవిష్యత్తూ గూర్చి ఆలోచిస్తుంది. ఆ సమయంలో (వర్తమానంలో) జరిగే దాన్ని గురించి ఎందుకు ఆలోచించదు ?

స: గతమూ, భవిష్యత్తూ అనేవి ఎవరైనా అర్థం చేసుకోగలరు. కాని వర్తమానం అనేది ఏమిటన్నది నిర్వచించటం చాలా కష్టం. సందర్భాన్ని బట్టి దాని స్వరూపం మారుతుంది. "ఈ ఏడు," "ఈ రోజు," "ఈ శతాబ్దం," అనే మాటలు వాడినప్పుడు ఒక సంవత్సరమూ, ఒక రోజూ, ఒక శతాబ్దమూ వర్తమానం అయినట్టే మాట్లాడతాం. అలాగే "ఆధునిక యుగంలో" అన్నప్పుడు ఆ యుగం భూతకాలమూ కాదు, భవిష్యత్కాలమూ కాదు గనక అది వర్తమాన కాలమే కావాలి.

మనస్తత్వరీత్యా చూస్తే అసలు వర్తమానం అంటూ ఉన్నదా అన్న సందేహం వస్తుంది. ప్రతి క్షణమూ వర్తమానం నుంచి గతంలోకి పోతూ ఉంటుంది. భవిష్యత్తు నుంచి వర్తమానంలోకి వస్తూ ఉంటుంది. ఏ క్షణాన్ని మనం ఆపి పట్టుకుని, "ఇది వర్తమానం" అనలేం. అందుచేత మనసు దేని మీదనైనా లగ్నమై ఉన్నంతకాలమూ అది వర్తమానమే అవుతుంది. మనసు పొందే ఏ అనుభవమైనా వర్తమానానికి చెందినదే అనుకోవచ్చు. అనుభవం పూర్తి అయితే తప్ప దాన్ని గతానికి అంట గట్టలేం. ఒక కథ చదువుతాం, లేదా ఒక నాటకం చూస్తాం, లేదా ఒక పాట వింటాం.

మనసు పొందే ఈ అనుభవం జ్ఞానేంద్రియాలకూ, కర్మేంద్రియాలకూ సంబంధించి ఉంటుంది. ఈ అనుభవాన్ని గతం నుంచి గాని, భవిష్యత్తు నుంచి గాని పొందటం సాధ్యం కాదు, కనక మన అనుభవాలన్నీ వర్తమానానికి చెందినవే అనాలి. మనస్సు ఆలోచించేది అనుభవం గురించే గనక అనుభవం పొందుతూండగా దాన్ని గురించి ఆలోచించటం సాధ్యం కాదు. పాటలో ఒక సంగతి బాగుందనిపించినా, సినిమాలో ఒక నటన చెడిపోయిందనిపించినా, రచనలో ఒక మాట రెండర్థాలు స్ఫురింప జేస్తుందనిపించినా కూడా అనుభవం అయిన మీదటనే గాని సాధ్యం కాదు.

ఇక భవిష్యత్తు గురించి ఆలోచించటం, గతాన్ని గురించి ఆలోచించటం లాటిది కాదు. అది ఊహ మీద ఆధారపడుతుంది. ఆ ఊహ కూడా జరిగిన అనుభవాల మీద ఆధారపడేదే గనక, అనుభవానికి సంబంధించని ఆలోచన సాధ్యం కాదు.




## 84

పిల్లి మూలంగా రాబందు చచ్చిపోయిన కథ చెప్పి, కాకి లేడితో, "కనక, కుల గోత్రాలూ, స్వభావమూ తెలియనివాళ్ళను చేరనియ్యరాదు," అన్నది.

ఈ మాటకు నక్క మండిపడి, "లేడికి నువు మొదట పరిచయమైనప్పుడు దానికి నీ కులగోత్రాలూ, స్వభావమూ తెలుసునా ఏమిటి ? దానికీ, నీకూ రోజుకురోజు మైత్రి ఎలా అభివృద్ధి అవుతున్నది? నీ అల్ప బుద్ధి ఇందులోనే కనబడుతున్నది. 'ఇది నాది, ఇది పరాయిది' అన్న భావం సంకుచిత బుద్ధులకే తోస్తుంది. పండితులు లేని చోట అపండితుడే శ్లాఘించబడతాడు. చెట్టు లేనిచోట ఆముదపు చెట్టే మహా వృక్షం! విశాలహృదయులకు ప్రపంచమంతా తమదే! ఈ లేడికి నేను మిత్రుణ్ణి అయినట్టే నువూ అయావు," అన్నది.

"ఎందుకొచ్చిన కీచులాట? మన మందరమూ సుఖంగా కలిసి ఉందాం. జన్మతః ఎవరికి ఎవరూ మిత్రులుగాని, శత్రులుగాని కారు," అన్నది లేడి.

"అలాగేకానీ," అన్నది కాకి.

అది మొదలు ఆ మూడూ కలిసి ఉంటూ, పగలు ఆహారం కోసం దేని దారిన అది పోతూ ఉండేవి.

ఒకనాడు నక్క ఏకాంతంలో లేడితో, "మిత్రమా, ఈ అరణ్యంలో ఒక మూల పంటకు వస్తున్న చేను ఉన్నది. దాన్ని నీకు చూపుతాను," అని, లేడిని అక్కడికి తీసుకుపోయింది.

తరవాత లేడి రోజూ ఆ చేను వద్దకు పోయి, చేలోపడి మేస్తూ వచ్చింది. చేను గలవాడు ఈ సంగతి గ్రహించి, ఉచ్చు పన్నాడు. లేడి ఆ ఉచ్చులో చిక్కుకున్నది.

''నన్ను ఇప్పుడు చావు నుంచి మిత్రుడు తప్ప మరెవరు కాపాడగలరు?'' అని లేడి అనుకున్నది.

ఇంతలో నక్క అటుగావచ్చి, ఉచ్చులో చిక్కిన లేడిని చూసి, ''నా ఎత్తు పారింది. రైతు వచ్చి దీన్ని కోసి, మాంసం అంటు కున్న ఎముకలనైనా వదలకపోడు. కొంత కాలంపాటు నాకు కడుపునిండా తిండి!'' అని తనలో అనుకున్నది.

లేడి మాత్రం తన మిత్రుణ్ణి చూసి పరమానందం చెంది, ''మిత్రమా, ఉచ్చు తాళ్ళను నీ కోరలతో తెంచి, నన్ను విడి పించు. స్నేహితుడి విలువ ఆపత్సమయం లోనూ, యోధుడి విలువ యుద్ధంలోనూ, నమ్మకస్థుడి విలువ అప్పులలో మునిగి తేలేటప్పుడూ, భార్య విలువ కటిక దారిద్ర్యం సంభవించినప్పుడూ, బంధు వుల విలువ శోకసమయంలోనూ తెలు స్తుంది. వినోదంలోనూ, విషాదంలోనూ, కాటకంలోనూ, అరాజకంలోనూ, రాజ ద్వారానా, శ్మశానంలోనూ తోడుగా నిలిచిన వాడే నిజమైన మిత్రుడుగాని, బంధువు గాని అనిపించుకుంటాడు,'' అన్నది.

నక్క ఉచ్చు కేసి ఒకటికి నాలుగు సార్లు జాగ్రత్తగా చూసి, ''ఫరవాలేదు, తాళ్ళు గట్టివి! ఇది తప్పించుకోలేదు!'' అని రూఢిచేసుకుని, లేడితో, ''మిత్రమా, ఈ ఉచ్చును నరాలతో అల్లారు. పవిత్ర మైన ఈ ఆదివారంపూట ఈ అపవిత్రమైన జంతు తంతులను నా కోరలతో ఎలా



తాకను? ప్రపంచానికంతకూ కాంతినీ, శౌచాన్నీ ఇచ్చే సూర్యభగవానుడికి ఈరోజు అంకితమయినది గదా! ఇవాళ నేను నీ కోరిక తీర్చలేకపోయినందుకు నన్ను అపార్థం చేసుకోకు. రేపు ఉదయం వచ్చి నువు కోరిన ప్రకారం చేస్తాను," అని అది అవతలికి వెళ్ళిపోయి, ఒక పొద చాటున దాగి, ఎప్పుడు చేనుగలవాడు వచ్చి లేడిని కోస్తాడా, ఎప్పుడు తనకు మాంసం అంటుకున్న ఎముకలు లభిస్తాయా అని ఎదురు చూడసాగింది.

సాయంకాలం అయినా లేడి తిరిగి రాలేదని, కాకి దానికోసం అంతటా వెతికి, చీకటిపడేవేళ అది చేనులో ఉచ్చులో తగులుకుని ఉండటం చూసింది.

"మిత్రమా, ఏమిటిది?" అని కాకి లేడిని అడిగింది.

"నీ సలహా వినననందుకు కలిగిన దుష్ఫలితం! హితం కోరిన మిత్రుడు చెప్పే వివేకంగల సలహాలను వినని వాడు కష్టాలపాలవుతాడు. వాణ్ణి చూసి వాడి శత్రువులు ఆనందిస్తారు," అన్నది లేడి.

"ఆ ద్రోహి ఎక్కడ?" అని కాకి అడిగింది.

"నా మాంసం కోసం అంగలార్చుతూ, ఆ పొదవెనక దాగి ఉన్నది," అన్నదిలేడి.

"నేను ముందే చెప్పాను, మనం మంచి వాళ్ళమూ, దోషరహితులమూ గదా అని, దుర్మార్గులను నమ్మవలసినపని లేదు. నిర్దోషులు కష్టాలపాలు అయేది దుర్మా



ర్గుల మూలానే! ఎదట తియ్యగా మాట్లాడి, పరోక్షంలో ప్రయత్నాలకు విఘ్నాలు కలిగించే వాళ్ళు, పైన పాలూ, అడుగున విషమూగల పయోముఖవిషకుంభాలు!'' అని కాకి పెద్దగా నిట్టూర్చి, ''ఓరి దురాత్ముడా, ఇంత నీచానికి ఎలా ఒడిగట్టావురా? నీతో సహజీవనం చేస్తూ, నువు చెప్పే తియ్యటి కబుర్లు విని, 'ఆపదలో ఆదుకుంటావని విశ్వసించే మిత్రులకు ద్రోహంచెయ్యటం వల్ల నీ కీర్తి ఏం పెరుగుతుంధి? ఓ భూదేవీ! నమ్మకద్రోహం చేసే వాళ్ళ భారాన్ని నువు ఎలా మోస్తున్నావు? దుర్మార్గుడితో స్నేహం చెయ్యరాదు. వేడిగా ఉంటే చేతిని కాల్చి, ఆరిపోయి నాక కూడా చేతిని మసి చేసే బొగ్గు లాటి వాడు వాడు! దుర్మార్గుల పద్ధతే ఇంత అని తెలిసిన నేను నక్కను తప్పుపట్టే పనేమున్నది? దుర్మార్గుడు మొదట కాళ్ళ మీద పడతాడు. తరవాత చెవిలో తియ్యగా ఏదో పాడతాడు. చివరకు మనను కాటు వేస్తాడు. వాడి నాలుక మీద తేనే, కడుపులో విషమూ ఉంటాయి! మిత్రమా, తెల్లవారుతూనే రైతు వస్తాడు. నే నేమో నిన్ను కాపాడలేను. అందుచేత రైతు రావటం దూరానే చూసి నేను నీకు హెచ్చరికగా అరుస్తాను. నువు చచ్చిపోయినట్టు నేల మీద పడిపో. నేను మళ్ళీ అరుస్తాను చూడూ! అప్పుడు లేచి పారిపో!" అన్నది.

తెల్లవారుఝామున చేనుగల రైతు దుడ్డుకర్రతో వచ్చాడు. వాణ్ణి దూరాన చూస్తూనే కాకి అరిచింది. లేడి నేల మీద పడి ప్రాణంపోయినట్టు నటించింది. రైతు పరమానందంచెంది, ''నీ అంతట నువే చచ్చావా? భేష్!'' అంటూ ఉచ్చులు ఊడదీసేశాడు. వాడు ఉచ్చులను ముడుస్తూండగా కాకి మళ్ళీ అరిచింది. లేడి చప్పునలేచి, వేగంగా పరిగెట్టుతూ, నక్క దాగిఉన్న పొదనుదాటి వెళ్ళిపోయింది. ఆశాభంగంకలిగిన రైతు, తన దుడ్డుకర్రను పొద కేసి బలంగా విసిరాడు. దాని దెబ్బకు నక్క చచ్చి ఊరుకున్నది.






## 2

[కుండలినీద్వీప రాజైన చిత్రసేనుడు, కీర్తికాంక్షతో ప్రజలపై పన్నులు సగానికి సగం తగ్గించివేశాడు. ఫలితంగా కొద్దికాలంలోనే ధనాగారం వట్టిపోయింది. సేనాని సలహాపై, యితర దేశాల నుంచి ధనం దోచుకువచ్చేందుకు, కుండలినీ సైన్యాలు ఓడలలో బయలు దేరినై. అదే సమయంలో దక్షిణదిక్కున ఒక తోకచుక్క కనబడింది. తరవాత—]

కుండలినీ రాజ్య సైనికులతో బయలు దేరిన ఓడలు తీరం వదిలి, సముద్రం లోపలకు పోసాగినై. ఆ సమయంలో సముద్రం ప్రశాంతంగానూ, గాలి ఎంతో అనుకూలంగానూ వున్నది.

సైనికులందరూ ఎంతో ఉత్సాహంగా వున్నారు. కాని, సేనాధిపతి అయిన సమర సేనుడు మాత్రం తన ఓడ పైన ఒక మూలగా ఎత్తయిన ఆసనంమీద కూర్చుని, దక్షిణదిక్కున మెరుస్తున్న తోకచుక్క కేసి చూడసాగాడు.

సమరసేనుడు అలా తోకచుక్క కేసి చూస్తూండగానే, కొంచెం ఎడంగా కారు మేఘాలు లేచి, తోకచుక్కను కమ్మి వేసినై. చుట్టూ కటిక చీకటి అలము కున్నది. క్రమంగా సముద్రం పొంగులు వారుతూ, గర్జించసాగింది. ఇదిచూసి సైనికులు భయకంపితులయ్యారు.



సమరసేనుడు నిశ్చేష్టుడైపోయి అలా చూస్తూనే వున్నాడు. అంతలో నౌకాధిపతి అతడి దగ్గిరకు వచ్చి, "మహాసేనానీ! మన సైకులు భయకంపితులైపోతున్నారు. వాళ్ళల్లో కొందరు తీరం చేరటం మంచిదని కేకలు వేస్తున్నారు," అని చెప్పాడు.

సమరసేనుడు కూర్చున్న చోటు నుంచి లేచి, ఒకమారు ఆకాశం కేసీ, అల్లకల్లోలమవుతున్న సముద్రం కేసీ చూశాడు. తరవాత నౌకాధిపతి కేసి తిరిగి, "కుండలినీదేవి కరుణిస్తే, త్వరలోనే అంతా సానుకూలమైపోతుంది. మీరు వెంటనే వెళ్ళి, సేనానిగా అనేకానేక యుద్ధాల్లో ఆరితేరిన సమరసేనుడి వాయకత్వం కిందవున్న సైనికులకు, ఎన్నటికీ హాని జరగదని చెప్పండి." అన్నాడు.

ఆ తరవాత ఒక పావుగంట కాలం గడిచినా, వాతావరణంలో ఎలాటి మార్పూ లేదు. ఇంకా సముద్రం పెద్దపెద్ద అలలతో అల్లకల్లోలం అవుతూనే వున్నది. ఆకాశం కారుమేఘాలతో కప్పబడిపోతున్నది. దీనికితోడు భయంకరమైన పెనుగాలి ప్రారంభమైంది,

క్రమంగా సైనికులు గుండె నిబ్బరం కోల్పోసాగారు. పెనుగాలి ధాటికి ఓడలన్నీ దారీతెన్నూ లేకుండా తలకొక దిశకూ చెదిరిపోసాగినై. ఈ స్థితిలో సైనికులు ఎవరికి వారు ఓడపై దొరికిన ఆసరాలన్ను పట్టుకుని, ప్రాణరక్షణ కోసం పెనుగులాడజొచ్చారు.

రాత్రి అవుతున్నకొద్దీ తుఫానుగాలి తీవ్రం కాసాగింది. నావికుల స్వాధీనం తప్పిన ఓడలు .ఒకదాని కొకటి ఢీకొని, చిన్నాభిన్నం కాసాగినై. సమరసేనుడు ప్రయాణిస్తున్న ఓడ చాలా పటిష్ఠంగా నిర్మించబడింది. ఆ కారణంగా అది యితర ఓడల తాకిడికి తట్టుకుని, అలల మీద తేలియాడుతూ పోసాగింది.

సమరసేనుడు యీ భీభత్సం చూసి చలించిపోయాడు. సూర్యోదయం అయితే గాని, ఎన్ని ఓడలు మునిగిపోయాయో,

ఎందరు సైనికులు మరణించారో తెలియదు. అతడు తన ఓడలో వున్న కుండలినీదేవి విగ్రహంముందు మోకరిల్లి, భక్తితో ప్రార్థించసాగాడు.

తరవాత చాలా సేపటికి సూర్యోదయమయింది. అకస్మికంగా బయలుదేరిన పెనుగాలీ, కారు మేఘాలూ విచ్చిపోయినై. ఓడ పైన దేవీవిగ్రహం ముందు కూర్చుని వున్న సమరసేనుణ్ణి, దిగువ నుంచి సైనికులు కోలాహలంగా, "అయ్యా, సముద్రం ప్రశాంతంగా వున్నది. తమరు ఒక్కసారి కిందికి దిగివచ్చి, ముందు చేయవలసి దేమిటో ఆజ్ఞాపించండి!'' అంటూ కేకలు పెట్టారు.



సమరసేనుడికి తల మీది నుంచి కొండంత బరువు దిగిపోయినట్టయింది. అతడు దేవివిగ్రహం ముందు నుంచి లేచి, చుట్టూ ఓమారు కలయచూశాడు. ఓడలలో సగానికి సగం సముద్రంలో మునిగిపోయినై మిగిలినవి దూర దూరంగా చుట్టూ సముద్రం మీద తేలియాడుతున్నవి.

సైనికుల్లో చాలామంది మరణించారని సమరసేనుడు గ్రహించాడు. మునిగిపోయిన ఓడలు మునిగిపోగా, ఉన్న వాటిని ఒకచోట చేర్చటం తక్షణ కర్తవ్యంగా అతడికి తోచింది. వెంటనే తన ఓడకు లంగరు వేయించాడు. చిన్న పడవలలో సైనికులను పంపి, చెల్లా చెదరుగా వున్న ఓడ లన్నిటినీ, తన ఓడ దగ్గరకు తీసుకురావలసిందిగా ఆజ్ఞాపించాడు. కొద్దిసేపటికల్లా ఓడలన్నీ వచ్చి సేనాని వున్న పెద్ద ఓడ చుట్టూ చేరినై. సైనికులందరూ ఓడలపైకివచ్చి నిలబడి, తమ సేనానికి తలలు వంచారు.

ఆ నిలబడిన వారిలో ప్రతిఒక్కడూ, రాత్రి తుఫానుదెబ్బకు నానాయాతనలూ పడి, అదృష్టవశాన బతికిబయటపడ్డవాడే!

సైనికుల వాలకం చూస్తూనే సమరసేనుడు పరిస్థితి ఎంత నిరుత్సాహజనకంగా వున్నదో గ్రహించాడు. రాత్రి



కలిగిన అనుభవంతో సైనికులు సముద్రమంటే హడలిపోతున్నారు. అందుచేత యింకా సముద్రం మీదనే కాలంగడపటమనేది కానిపని. చూడగా తామిప్పుడు సముద్రంలో ఏ ప్రాంతాల వున్నదీ తెలియటంలేదు. సమరసేనుడు సైనికుల్లో ఒకణ్ణి పిలిచి, తెరచాపకొయ్య ఎక్కి, ఎక్కడైనా భూమి వున్న ప్రదేశం కనబడుతుందేమో చూడమన్నాడు.

సైనికుడొకడు తెరచాపకొయ్య శిఖరం ఎక్కాడు. అందరూ అతడి కేసి చూడసాగారు. సైనికుడు కొంతసేపు చుట్టూ పరికించి, ''దగ్గిరలో ఎక్కడా భూప్రదేశం కనబడటంలేదు. కాని, తూర్పు దిక్కున చాలాదూరంలో పక్షులు ఎగురుతున్నట్టుగా నా దృష్టికి గోచరిస్తున్నది,'' అన్నాడు.

ఈ మాట వింటూనే సమరసేనుడు, "జై, కుండలినీ మహాదేవికీ, జై!" అంటూ ఉత్సాహంతో కేక పెట్టాడు. అతనితోపాటు సైనికులందరూ, ''కుండలినీమహాదేవికీ జై!'' అంటూ విజయధ్వానాలు చేశారు.

సేనాని ఆజ్ఞ ప్రకారం ఓడలన్నీ ఆ పక్షులు ఎగురుతున్న దిక్కు కేసి పోసాగినై. తెరచాపకొయ్య పైకి ఎక్కిన సైనికుడు అక్కడనే వుండి, ఓడలన్నిటికీ దారి చూపుతున్నాడు. కొంత సేపటికి మిట్టమధ్యాహ్నమై, క్రమంగా సూర్యుడు

పడమటి దిక్కుకు వాలసాగాడు. అయినా ఎంతకూ భూమి ఆనవాలు దొరకనందున సైనికులలో తిరిగి నిరాశఅలముకున్నది. సైనికులలో ఒకడు సూర్యాస్తమయం కాబోతున్నదనేసరికి, ''అరెరే, ఇంకా స్సేపటిలో చీకటి పడిపోతుంది. ఈ మహా సముద్రం నడిమధ్య దారీతెన్నూ కానక ప్రమాదాలకు లోనుకావలసొస్తుంది!'' అనుకుంటూ సైనికులు భీతి చెందారు.

ఆ సమయంలో తెరచాపకొయ్య మీద వున్న సైనికుడు, ''అదిగో, అదిగో, భూప్రదేశం! చాలా దాపులనే కనబడుతున్నది.'' అంటూ కేక పెట్టాడు. సైనికులకు కలిగిన ఉత్సాహం అంతా యింతా కాదు.

ఓడలన్నీ భూమి కనబడిన దిక్కు కేసి సాగిపోతున్నవి. అంతలో సూర్యాస్తమయమైంది. కొద్ది సేపటికల్లా ఓడలన్నీ ఒకానొక భూప్రదేశానికి చేరుకొన్నవి. పరీక్షించి చూడగా అది ఒక ద్వీపమని తెలిసింది. ఓడల నుంచి దిగాలని ప్రతి సైనికుడి మనస్సూ ఉరకలు వేస్తున్నది. కాని, సమరసేనుడు, ''నా ఆజ్ఞ లేకుండా ఎవరూ ఓడలు దిగవద్దు!'' అని ఆజ్ఞాపించాడు.

వాళ్ళు చేరినది సముద్ర మధ్యంలో భయంకరమైన ఒక మహాద్వీపం.



ద్వీపాన్నుంచి పర్వత పంక్తులు సముద్రంలోకి ఒరుసుకువచ్చి వున్నవి. వాటిపైన దట్టంగా పెరిగిన మహావృక్షాలు. వాటి మధ్య తిరుగుతున్న వింత వింతల వన్యమృగాలు. అలాంటి ప్రదేశంలో తగు జాగ్రత్తలేకుండా ఓడలు దిగడం ప్రమాదమనుకున్నాడు, సేనాని సమరసేనుడు.

సమరసేనుడు సైనికులను రెండు భాగాలుగా చేసి, అందులో కొంతమందిని చిన్న పడవలలో ద్వీపం యొక్క తీరానికి పంపడం మంచిదనుకున్నాడు. వాళ్ళు ద్వీపంలోకి పోయి, అక్కడి పరిస్థితులు తెలుసుకు వచ్చాక, తతిమ్మా వాళ్ళు వెళ్ళటం క్షేమమని అతడి ఉద్దేశం.



పడవ ఎక్కి, కొంచెంసేపటిలో తీరం చేరుకున్నారు.

తీరప్రాంతమంతా నిర్జనంగా వున్నది. ఎక్కడా మానవులు మసిలిన జాడలు లేవు. అయినా సమరసేనుడు ఏమరుపాటు లేకుండా, కత్తి చేతబట్టి, ముందుండి దారి తీశాడు. మనుషులు కనిపించక పోయినా, వాళ్ళు ఏ చెట్టు వెనకనో దాగివుండి తమ మీద బాణాలు ప్రయోగించవచ్చు....

ఇలా ఆలోచిస్తూ ముందు నడుస్తున్న సమరసేడుడికి హఠాత్తుగా ఒక భయంకర గర్జన వినబడింది. ఆ వెంటనే సైనికుల్లో ఒకడు, "సేనానీ, యీ గర్జన ఏ జంతువుదో గాని, చాలా వికృతంగా, భీతిగొలిపేదిగా వున్నది. ఇలాంటి గర్జన నేను ఏనాడూ వినివుండలేదు.'' అన్నాడు వణికిపోతూ.

తతిమ్మా సైనికులు కూడా భీతిచెంది దిక్కులు చూస్తూ వణికిపోసాగారు. సమరసేనుడు, వాళ్ళకు ధైర్యం చెప్పి, ముందు నడుస్తుండగా, సైనికులు అతణ్ణి అనుసరించారు. కొద్దిసేపటి తరవాత వాళ్లు గుంపుగావున్న చెట్ల మధ్యకు చేరారు. వాటికి కొద్దిదూరంలో పెద్దకొలను ఒకటున్నది. దానిముందు కనిపించిన భయంకర దృశ్యం చూసి అందరూ నిశ్చేష్టులైపోయారు.

ఐతే ముందుగా ద్వీపంలోకిపోయి రావటానికి సమర్థులైన సైనికులెవరు? అటువంటి కొత్తప్రదేశానికి పోయి సంగతి సందర్భాలు తెలుసుకోవాలంటే ధైర్యమూ సాహసమూ మాత్రమే చాలవు; సమయోచితమైన యోచనా, యుక్తీ కావాలి,

ఇంతగా ఆలోచించిన తరవాత, స్వయంగా తను వెళ్ళిరావడమే అన్ని విధాలా శ్రేయస్కరమని తోచింది, సమరసేనుడికి. అతడు తన సైనికులలో ఆరుగురిని — ఎన్నో యుద్ధాలలో పాల్గొని బాగా రాటుతేలినవారిని, వెంటతీసుకుని, ఆ కొత్త ద్వీపానికి బయలుదేరాడు. సమరసేనుడూ, ఆరుగురు సైనికులూ చిన్న

కొలను ఒడ్డున రెండు వికృత జంతువుల భయంకర పోరాటం సాగుతున్నది. మరికొన్ని జంతువులు దూరంగా చెట్ల కింద నిలబడి, ఆ పోరాటాన్ని చూస్తున్నవి. దాపులనున్న చెట్ల కొమ్మలపైన మనుష్యాకారంలోవున్న, పెద్ద పెద్ద నరవానరాలు పోరాట దృశ్యాన్ని చూస్తూ, మధ్యమధ్య, మాట్లాడుకుంటున్నవి. వాటి చేతులలో, రాతితో తయారుచేసిన ఆయుధాలున్నవి.

సమరసేనుడు వాటిని సైనికులకు చూపుతూ, ''నిజానికి యివన్నీ వింత జంతువులే! ఆ చెట్లపై వున్నవి నరులూ కాదు, వానరులూ కాదు. రాతియుగంలో నివసించిన మానవులను మనం చూస్తున్నాం. ఈ పోరాడే జంతువులు ఎన్నో లక్షల సంవత్సరాలకు పూర్వపువి.'' అన్నాడు.

ఏమనేందుకూ సైనికులకు తోచలేదు. ఇంత భయంకరమైన ద్వీపంలో దోచుకుపోయేందుకు ధనరాసులంటూ ఉండటం సాధ్యమా ? అనుకోసాగారు వాళ్ళు.

సేనాని సమరసేనుడికీ యిలాంటి అనుమానమే కలిగింది. కుండలినీ రాజ్యపు ధనాగారాన్ని నింపటానికి, పర రాజ్యాలను కొల్లగొట్టేందుకు తాను బయలుదేరాడు. కాని, యీ భయంకర ద్వీపం చేరాడు. ఇప్పుడేం చేయటం?

సమరసేనుడు యిలా ఆలోచిస్తూం డగా, కొలను సమీపాన భయంకర జంతువుల పోరాటం మరింత భీకరం కాసాగింది. వాటి వికృతమైన అరుపులకు భీతిచెందిన ఏనుగులు దూరంగా పారిపోసాగినై. ఆ సమయంలో ఏనుగుల గుంపు నుంచి వేరుపడిన ఐరావతం లాంటి పెద్ద ఏనుగొకటి, చెట్లకు అడ్డంపడి పరిగెత్తుతూ, సమరసేనుడూ, సైనికులూ వున్న చెట్ల కేసి రాసాగింది.

సమరసేనుడు, సైనికులను హెచ్చరిస్తూనే దాపులనున్న చెట్టు పైకి ఎగబాకాడు. ఆ మరుక్షణం రెండు సింహాలు భీకరంగా గర్జిస్తూ వచ్చి, ఏనుగు మీదికి దూకినై.

—(ఇంకావుంది)





# వాత్సల్యం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు పై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, రాజులు రాజనీతి ముందు ఇంకే నీతినీ పాటించరనుకుంటాం. కాని రాజకీయంగా విషమపరిస్థితిని ఎదుర్కొన్న రాజులు సైతం వాత్సల్యానికి దాసులలాగా ప్రవర్తిస్తారనటానికి రవివర్మ ప్రవర్తనే నిదర్శనం. నీకు అతని కథ చెబుతాను, శ్రమతెలియకుండా విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

రవివర్మ చాలా బలవంతుడు. అతను విజయశేఖరుడు అనే రాజును యుద్ధంలో అవలీలగా ఓడించి, అతని రాజ్యాన్ని తనది చేసుకున్నాడు. యుద్ధంలో విజయశేఖరుడు వీరోచితంగా పోరాడి, తన

## బేతాళ కథలు

ప్రాణాలను కోల్పోయాడు. ఈ వార్తవిని పచ్చిబాలింతరాలైన అతనిభార్య గుండెలు అవిసి మరణించింది. కాని రవివర్మ, తనకు పిల్లలు లేనికారణంగా, విజయ శేఖరుడి కొడుక్కు విజయవర్మ అని పేరుపెట్టి, తన సొంత కొడుకు లాగే చూసుకున్నాడు.

తరవాత కొంత కాలానికి రవివర్మకు ఒక కూతురు కలిగింది. అయినా రవి వర్మకు విజయవర్మ మీద వాత్సల్యం ఏ మాత్రమూ తగ్గలేదు. అతను అనాథ అయిపోతాడనుకున్న వారందరూ పొర పాటు పడ్డారు. రవివర్మ తన కూతుర్నీ, విజయవర్మనూ సమంగా చూసుకుంటూ పెంచి పెద్దవాళ్ళను చేశాడు.

రవివర్మ కుమార్తెకు యుక్తవయసు వచ్చింది. ఆమె స్వయంవరం ప్రకటిస్తూ, రవివర్మ తన కాబోయే అల్లుడికి అర్ధ రాజ్యం ఇస్తానని చాటించాడు.

ఈ మాట విని విజయవర్మకు ఎలాటి మనఃక్లేశమూ కలగలేదు గాని, కొత్తగా సేనాపతి అయిన భూపతి అనే వాడిని చాలా బాధించింది. అతను విజయవర్మతో స్నేహం పెంచుకుని, అతని హితంకోరిన వాడిలాగా రాజు మీద లేనిపోనివి కల్పించి చెబుతూ రాసాగాడు.

ఒకసారి భూపతి విజయవర్మతో, "ఏమైనా నువు రాజుగారికి పెంపుడు కొడుకువేగద! ఇదే సొంత తండ్రి అయితే నీకు రావలసిన రాజ్యంలో సగం తీసుకు



పోయి తనకాబోయే అల్లుడికి ఇస్తాడా? నిజానికి ఈరాజ్యం నీ తండ్రిది. ఆవిధంగా చూసినా రాజ్యమంతా నీదేకద? నువు కొంచెం సాహసం ప్రదర్శిస్తే, నీకు పూర్తి రాజ్యం దక్కుతుంది. అందుకు కావలసిన సహాయం నేను చేయగలను," అన్నాడు.

"ఒకవేళ మనం కుట్ర చేస్తున్నట్టు రాజుకు తెలిస్తే, మన కుట్రను భగ్నం చెయ్యటమేగాక, రాజు మనకు మరణ శిక్ష విధించడా?" అని విజయవర్మ భూపతిని అడిగాడు.

"ఆ భయం నీకు అవసరం లేదు. మన కుట్ర రాజుకు తెలిసినట్టు అనుమానం కలిగిన మరుక్షణం రహస్య మార్గాల కుండా మనం మన పొరుగు రాజైన నరసింహుడి వద్దకుపోయి, అతని సహకారంతో రాజభవనాన్ని తేలికగా వశపరచుకుందాం. నీకు అంతఃపుర రహస్యాలు తెలుసుగద?" అన్నాడు భూపతి.

ఆ రోజు సాయంకాలం రవివర్మ ఉద్యానవనంలో ఉండగా ఆయన పెంచే టపా పావురం వచ్చి ఆయన భుజంమీద వాలింది. అది తెచ్చిన ఉత్తరంలో, "ఈ రాత్రి రాజుగారిపై హత్యాప్రయత్నం జరుగుతుంది. విజయవర్మ రాజ్యాన్ని స్వాధీనం చేసుకునేటందుకు భూపతితో కలిసి కుట్రపన్నుతున్నాడు," అని ఉన్నది.

రవివర్మ వెంటనే ఇంటికి వెళ్ళి, అంతఃపుర రక్షకులను హెచ్చరించాడు.





ఆ మార్గం కుండానే విజయవర్మా, భూపతీ నరసింహుడి రాజ్యానికి వెళ్ళారు. విజయవర్మ అంతఃపురంలోని తిరుగుబాటులో ఉంటే నరసింహుడికి లాభించదని చెప్పి, భూపతి నరసింహుడి చేత విజయవర్మను కారాగారంలో బంధింపజేశాడు.

తరవాత భూపతి నరసింహుణ్ణీ, మెరికలలాంటి యాభై మంది సైనికులనూ వెంటబెట్టుకుని వచ్చి, రహస్యమార్గంలో ప్రవేశపెట్టాడు. వచ్చిన వారిలో విజయవర్మ లేడన్న కబురు అంతఃపురానికి చేరింది.

రాజును హత్య చెయ్యటానికి నియోగించబడిన మనిషి పట్టుబడ్డాడు. వాడు తనను భూపతీ, విజయవర్మా నియోగించినట్టు చెప్పాడు.

ఆ రాత్రి భూపతి విజయవర్మ వెంట ఉండినట్టు తెలిసింది, కాని వారిద్దరి జాడా రాజభవనంలో కానరాలేదు. వారు రహస్య మార్గంగా పోయి ఉంటారనుకునేటందుకు ఆధారాలు దొరికాయి. ఆ సొరంగం రెండో చివర అరణ్యప్రాంతంలో ఒక ఆలయంలోని విగ్రహం వెనక ఉన్నది. ఆలయంచుట్టూ ఉన్న చెట్ల వెనక కొందరు సైనికులను రహస్యంగా కాపలా ఉంచారు.

రాజాజ్ఞపై, సొరంగం రెండు చివరలా దిగ్బంధం జరిగింది. విద్రోహులు అందులో చిక్కిపోయారు.

ఈ లోపుగా రవివర్మ తన సేనలను తీసుకుపోయి, నరసింహుడి రాజ్యాన్ని సులువుగా జయించి, విజయవర్మను చెరవిడిపించి, అప్పటికప్పుడే అతన్ని నరసింహుడి రాజ్యానికి రాజుగా అభిషేకించాడు.

వారం రోజులపాటు సొరంగంలో అన్నపానీయాలు లేకుండా ఉండిపోయిన విద్రోహులు రవివర్మకు సులువుగా దొరికిపోయారు. భూపతీ, నరసింహుడూ ఉరిశిక్ష పొందారు. సైనికులు తమ రాజ్యానికి

తిరిగిపోయి, విజయవర్మకు అంగరక్షక దళంగా పని చేశారు.

వీరవర్మ కుమార్తెకు వివాహం అయినప్పుడు ఆమె భర్తకు అర్ధరాజ్యం ఇయ్యగా, మిగిలిన అర్ధరాజ్యాన్ని రవివర్మ విజయవర్మ రాజ్యంలో కలిపేశాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, కుట్రదారులలో ఒకడైన భూపతికి మరణదండన విధించిన రవివర్మ, కుట్రలో చేరిన రెండవవాడైన విజయవర్మను దండించకపోగా, అతన్ని రాజుగా ఎందుకు చేశాడు? అది రాజనీతి అనిపించుకుంటుందా? లేక కేవల వాత్సల్యమా? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "భూపతి తలపెట్టిన కుట్రను భగ్నం చెయ్యటానికి పూర్తిసహాయం చేసినవాడు విజయవర్మే అనటానికి ఎటువంటి సందేహమూ లేదు. రాజుకు పావురం ద్వారా చీటీ పంపగలవాడు అతనే! రాజును చంపటం కుట్రలో భాగమైతే, ఆ పని విజయవర్మ అతి సులువుగా చేయగలడు. దానికి గాను మరొక మనిషిని నియోగించనవసరం లేదు. అన్నిటినీ మించినది, అతను పారిపోవటానికి సారంగమార్గాన్ని ఉపయోగించటం. ఆ మార్గం భూపతికి తెలియగలందులకూ, దాన్ని అతను శత్రువుకు చెప్పటానికీ విజయవర్మ అలా చేశాడన్నది స్పష్టం. ఎందుకంటే విజయవర్మ నరసింహుడి దగ్గిరికి మామూలు మార్గానే పోవచ్చు. రహస్య మార్గంతో పని ఏమిటి? ఇదంతా రవివర్మ సులువుగా గ్రహించి ఉండాలి. ఇంకా ఏమన్నా సందేహం మిగిలి ఉంటే, విజయవర్మను నరసింహుడు కారాగృహంలో బంధించటం ఆ సందేహాన్ని నివృత్తి చేసింది," అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)



# మొదటికే మోసం

వీరన్న తన ఊళ్ళో అందరికీ అన్నివిధాలా తోడ్పడి అందరి మెప్పు సంపాదించి, ఊరివాళ్ళ సహాయంతో పెళ్ళి చేసుకుని, ఇల్లు గలవాడై, నాలుగురాళ్ళు వెనక వేసుకున్నాడు.

అయితే ఒకరోజు దొంగలు పడి వీరన్న ఇంట్లో పూచికపుల్ల మిగల్చకుండా, పూర్తిగా దోచుకుపోయారు. ఆ స్థితిలో ఊరివాళ్ళు మళ్ళీ పూనుకుని, తలా కాస్తా చందాలు వేసుకుని, వీరన్న ఇల్లు నిలబెట్టారు.

బతికి నన్నాళ్ళూ అక్రమార్జన చేసి అంతులేని డబ్బు గడించిన బంగారయ్యకు ఇది చూసి దుర్బుద్ధి పుట్టింది. ఒక రాత్రి తమసొత్తు యావత్తూ ఊరివెలపల చెరువు దగ్గిర పాతిపెట్టి, బంగారయ్యా, అతని భార్యా తెల్లవారగానే తమ ఇల్లు దొంగలు దోచారో అని శోకాలు మొదలు పెట్టారు. ఈ దొంగతనం గురించి క్షణంలో ఊరంతా తెలిసింది, కాని ఎవరూ బాధపడలేదు. బంగారయ్య ఏనాడు ఎవరిని ఆదుకున్నాడు గనకా ? అందరూ సానుభూతి చూపారు గాని ఒక్కరూ చిల్లిగవ్వకూడా ఇయ్యలేదు.

అందుచేత బంగారయ్య దంపతులు అమావాస్య రాత్రి తాము పాతినసొత్తు తవ్వుకుని, తెల్లవారే లోపల మరో ఊరు వెళ్ళి పోదామనుకున్నారు. కాని అకస్మాత్తుగా గ్రామాధికారికి, కొంతకాలంగా అనుకుంటున్న గుడి పని ప్రారంభించాలనీ, చెరువు దగ్గిర గుడినిర్మాణం జరగాలనీ నిర్ణయం కలిగింది.

గుడికి పునాదులు తవ్వుతూండగా బంగారయ్య దాచిన డబ్బు దొరికింది. దేవుడు తన గుడి ఖర్చు తానే సంపాదించాడన్నారు. బంగారయ్యకు చచ్చినది చావయింది!

—పి. వేణుగోపాల్





# కట్నం కన్నీరు

వెంకటరత్నం అనే వ్యాపారస్థుడి సంతానం నలుగురూ కొడుకులే కావటం చేత అందరూ అతన్ని అదృష్టవంతుడు అనేవారు. వెంకటరత్నం కూడా అలాగే అనుకుంటూ వచ్చాడు.

ఒక షావుకారు వెంకటరత్నం పెద్ద కొడుక్కు పిల్లను ఇస్తానని వచ్చి, "మీరు కోరినంత కట్నం ఇస్తాను. కాని ఒక్క షరతు: మీ అబ్బాయిని ఇల్లరికం పంపాలి," అన్నాడు.

డబ్బుకోసం దేనికైనా సిద్ధంగా ఉన్న వెంకటరత్నం పాతిక వేలు తీసుకుని పెద్ద కొడుక్కు పెళ్ళి చేసి, కాపరానికి పంపేశాడు! అలాగే అతను ఇరవైవేలు రాబట్టుకుని, రెండో కొడుక్కు బొత్తిగా ఇష్టం లేని సంబంధం చేశాడు.

మూడో కొడుక్కు కలిగిన ఇంటి పిల్ల దొరికింది. ఈసారి కూడా వెంకటరత్నం కట్నం కింద ఇరవై వేలు రాబట్టాడు. అయితే మూడో వాడి భార్య తన భర్తచేత వేరే కాపరం పెట్టించింది.

ఇలా కొడుకులు ఒక్కరొక్కరే తనకు కాకుండా పోతున్నందుకు వెంకటరత్నం చింతించలేదు. వాళ్ళ ద్వారా తాను ఆశించినదానికన్న చాలా ఎక్కువ కట్నమే వచ్చింది.

అయితే పెద్దవాళ్లు ముగ్గురిలా కాక, నాలుగోవాడు ఎదురు తిరిగి, కట్నం తీసుకునే పక్షంలో తాను పెళ్ళి చేసుకోనని ఖచ్చితంగా చెప్పాడు. డబ్బు యొక్క గొప్పదనం గురించి తండ్రి ఎంత నూరి పోసినా వాడు వినలేదు.

"కట్నం మానేసి, ఉత్త లాంఛనాలైనా తీసుకుందాం!" అన్నాడు వెంకటరత్నం, ఆ పేరుతో రావలసినది రాబట్టుదామని.

ఎ. కె. విశ్వనాథశర్మ

"కట్నంగాగాని, కానుకగాగాని దమ్మిడీ కూడా తీసుకోకుండా ఉంటేనే నేను పెళ్లి చేసుకునేది!" అని చెప్పేసి, నాలుగోవాడు తనకు నచ్చిన పిల్లను తెచ్చుకుని, తండ్రి ముందే పూలదండలు మార్చుకున్నాడు.

ఇంత ధిక్కారాన్ని సహించలేక వెంకటరత్నం తన నాలుగో కొడుకును నానా తిట్లూతిట్టి, ఇంట్లో నుంచి వెళ్ళ గొట్టేశాడు.

కాలం గడిచింది. వెంకటరత్నం ముసలివాడు అయాడు. భార్య ఏనాడో పోయింది; కొడుకులను దూరం చేసుకున్నాడు; ఒంటరితనంతో దిక్కులేని వాడై, మంచం పట్టాడు. డబ్బిచ్చి ఎవరి నన్నా పెట్టుకుని, తనకు చాకిరీ చేయించుకుందామంటే, వాళ్ళు తనను గొంతు పిసికి, డబ్బు కాజేసి పోతారేమోనని భయం! తనకు దిక్కులేని చావు రాసి పెట్టి ఉన్నది కాబోలుననుకుని బెంగపడి పోయాడు వెంకటరత్నం.

తండ్రి మంచాన పడినట్టు తెలిసి, నాలుగో కొడుకు భార్యతో సహా వచ్చాడు.

కొడుకును చూసి వెంటకరత్నం కంట నీరు పెట్టుకున్నాడు. కొడుకు అతన్ని ఓదార్చాడు. కోడలు వెంకటరత్నానికి తల్లిలాగా సేవలు చేసింది. వెంకటరత్నానికి పోతున్న ప్రాణం తిరిగి వస్తున్నట్టు అయింది. అతను కోలుకోసాగాడు.

అతను తన మిగిలిన కొడుకులను గురించి అడిగితే, నాలుగోవాడు, "అన్నయ్యలింక రారు, నాన్నా! నువు వాళ్ళకు ధరకట్టి అమ్ముకున్నావు. వాళ్లింక నీ వాళ్ళు కారు. రెండో అన్నయ్య ఇష్టం లేని భార్యతో నరకం అనుభవిస్తున్నాడు. వాడి సంగతే మరీ దారుణంగా ఉన్నది!" అన్నాడు.

వెంకటరత్నం చిన్నపిల్లవాడిలా ఏడ్చాడు! తన కొడుకులను తాను తిరిగి కొనుక్కోలేడు. తనకు ఈ దశలో కావలిసిన ప్రేమ డబ్బుకు అమ్ముడయింది! అమ్ముడు పోనివాడే చివరకు దక్కాడు!





# నిజమైన గొప్పవాళ్ళు

శ్రవణానందుడు అనే ధనవంతుడు పెద్దలు సంపాదించిన ఆస్తిని అనుభవిస్తూ, గ్రంథపఠనంతో కాలయాపన చేస్తూ, ఉన్న ఊళ్ళోనే సుఖంగా బతుకుతూ వచ్చాడు.

ఒకనాడు అతని ఇంటికి ముగ్గురు బంధువులు వచ్చారు. వారిలో ఒకడు వ్యాపారి, ఒకడు గాయకుడు, ఒకడు రాజోద్యోగి. శ్రవణానందుడు ముగ్గురికీ అతిథ్యం ఇయ్యటమేగాక, వారి వారి వ్యాపకాలను గురించి తెలివిగా మాట్లాడాడు.

''నీకు మంచి పరిజ్ఞానం ఉన్నట్టున్నది. మా ముగ్గురిలో ఎవరు గొప్పవాళ్లో చెప్పగలవా?'' అని వాళ్ళు శ్రవణానందుణ్ణి అడిగారు.

''గొప్పతనానికి వీరూ, వారూ అని ఏమున్నది? బతికినన్నాళ్ళూ సంతోషంగా ఉండ గలిగినవారంతా గొప్పవాళ్ళే. జీవితానికి సంతోషమే గదా ముఖ్యం?'' అన్నాడు శ్రవణానందుడు.

''అలాగనకు. ఎందరికో వ్యాపారం చెయ్యాలని ఉంటుంది. మరి అందరూ గొప్ప వ్యాపారులు కాగలరా!'' అని వ్యాపారి అడిగాడు.

అలాగే గాయకుడూ, రాజోద్యోగీ తమ ప్రత్యేకతలను గురించి చెప్పుకున్నారు.

శ్రవణానందుడు నవ్వి, ''ఆ మాటకు వస్తే మీలో గొప్పతనమేమీ లేదు. నేను మీ ముగ్గురినీ మీ వ్యాపకాలలో మించగలను.'' అన్నాడు.

అతని బంధువులకీ మాటలు సవాలుగా తోచాయి. అతను తనమాట రుజువు చేసుకోగలిగితే వెయ్యేసి వరహాలు ఇచ్చుకుంటామన్నారు. శ్రవణానందుడు ఈ పందాన్ని ఆమోదించి, తన బంధు

"వసుంధర"



వుల వెంట రాజధానీ నగరానికి వెళ్ళి, మొట్టమొదట వ్యాపారి ఇంట్లో మకాం చేశాడు.

వ్యాపారికి ఎన్నో దుకాణాలున్నాయి. వాటిలో కూరగాయల దుకాణం కూడా ఉన్నది. శ్రవణానందుడు వ్యాపారి దుకాణం నుంచి గంపెడు వంకాయలు తీసుకుని, వేరే కూర్చున్నాడు. అతను కొనవచ్చినవారికి అందరికన్న వంకాయల ధర హెచ్చుగా చెప్పాడు.

"ఇతరులకన్న ధర హెచ్చు చెబుతున్నావేం?" అని అడిగినవారికి శ్రవణానందుడు, "నాణ్యాన్ని బట్టి ధర ఉంటుంది. ఇతరులు అమ్మే సరుకే అయితే, నే నెందుకు హెచ్చు ధర చెబుతాను? నా సరుకు అందరూ కొనేదికాదు లెండి. ధనగుప్తుడుగారు ఎప్పుడూ నా దగ్గిరే కొంటారు," అనేవాడు.

అది అసలే ధనికులు కొనుక్కునే బజారు. కాస్త డబ్బుగలవాళ్ళ మనుకునే వారికి అతని దగ్గిర వంకాయలు అతను చెప్పిన ధరకే కొనటం తమ తాహతుకు నిదర్శనమనిపించింది. అతని సరుకంతా అమ్ముడుపోయి చాలా లాభం వచ్చింది.

మర్నాడు శ్రవణానందుడు సామాన్యుల బజారుకు వెళ్ళాడు. అక్కడ అతను తన సరుకు మీద తక్కువ లాభం వేసుకుని ఇతరులకన్న చవుకగా సరుకంతా అమ్మేసి, అమ్మకం హెచ్చుగా జరిగిన కారణంగా హెచ్చు లాభం తీశాడు.

"నీ తెలివితేటలు వెయ్యి వరహాల విలువే!" అంటూ అతని బంధువైన వ్యాపారి శ్రవణానందుడికి వెయ్యి వరహాలూ ఇచ్చేశాడు.

శ్రవణానందుడు అక్కడినుంచి గాయకుడి ఇంటికి మకాం మార్చాడు. అక్కడ అతను రోజూ గాయకుడి వద్దనే సంగీతం అభ్యసిస్తూ, రోజూ సాయం సమయాల్లో ఎక్కడికో వెళ్ళి వస్తూండేవాడు.

ఒక రోజు అతను ఒక లేడిని తీసుకు వచ్చి, "మన మధ్య సంగీతం పోటీ

జరిగితే ఎవరు నెగ్గినదీ ఈ లేడి చెబుతుంది,'' అని గాయకుడితో అన్నాడు.

ఇద్దరికీ పాటలో పోటీ అని తెలిసి చుట్టుపక్కలవాళ్లు చాలామంది వచ్చారు. ముందు గాయకుడు అద్భుతంగా పాడి, అందరి మెప్పుపొందాడు.

తరవాత శ్రవణానందుడు ఒక విరహ గీతం పాడాడు. తన ప్రియురాలైన రాణీ కోసం ప్రియుడు పాడే గీతం అది. అతని పాట బొత్తిగా పాడుగాలేదు. కాని అతను పాట ఆరంభించగానే లేడి వచ్చి అతని ముందు నిలబడి, అతని పాట అయిపోయే దాకా విని, తరవాత అవతలికి వెళ్ళింది.

వినేవాళ్ళూ, గాయకుడూ కూడా నిర్ఘాంతపోయారు. అందరూ శ్రవణానందుణ్ణి మెచ్చుకున్నారు. పాటతో జంతువును ఆకర్షించటమంటే మాటలా?

గాయకుడు శ్రవణానందుడికి వెయ్యి వరహాలూ ఇచ్చుకుంటూ, ''మృగాన్ని కూడా నీ పాటతో ఎలా ఆకర్షించావు?'' అని అడిగాడు.

''ఇంతులో పెద్ద విశేషమేమీలేదు. నేను లేడికి అర్థమయే పాట పాడాను. దాన్ని ముందుగా తయారు చేశాను. దాని పేరు రాణి! తన పేరు విని అది నా ముందుకు వచ్చింది,'' అన్నాడు శ్రవణానందుడు.



అక్కడి నుంచి అతను రాజోద్యోగి ఇంటికి వెళ్ళి, ''నీకు రాజు చేత మంచి బహుమతి ఇప్పించగలను,'' అన్నాడు

అతను ఆ మాట అన్నందుకు రాజోద్యోగికి కోపం కూడా వచ్చింది.

శ్రవణానందుడు రత్నం ఒకటి కానుకగా తీసుకుని మంత్రిగారి ఇంటికి వెళ్లి, ఆయనకు దాన్ని బహూకరించాడు.

మంత్రి సంతోషించి, ''నా వల్ల మీకు ఏమి సహాయం కావాలి?'' అని అడిగాడు.

''నాకు ఒక ఘడియపాటు రాజదర్శనం చేయించండి,'' అన్నాడు శ్రవణానందుడు. మంత్రి అతన్ని మర్నాడు సభకు రమ్మన్నాడు.

శ్రవణానందుడు మంత్రి వద్ద సెలవు పుచ్చుకుని ఒక ప్రసిద్ధ కవి వద్దకు వెళ్ళి, అతని కొక బంగారు కానుక ఇచ్చి, మహారాజును పొగడుతూ ఒక పద్యం రాయించి పుచ్చుకున్నాడు.

మర్నాడు అతను రాజసభకు వెళ్ళి, రాజుకు నమస్కరిస్తూ ఆ పద్యం చదివాడు.

రాజు చాలా ఆనందపడి, ''ఎవరు రాశారు ఈ పద్యం?'' అని శ్రవణానందుణ్ణి అడిగాడు.

దానికి శ్రవణానందుడు, ''కవి ఎవరో తెలియదు, మహారాజా. కాని మా బంధువు ఒకడు తెల్లవారి లేచి ఈ పద్యం చదవి గాని, ఏ పనీ ప్రారంభించడు. ఈ పద్యం విన్నమీదటనే నాకు తమ దర్శనం చేసుకోవాలని బలమైన కోరిక కలిగింది. నా కోరిక ఫలించింది,'' అన్నాడు.

శ్రవణానందుడి బంధువు తన కొలువు లోనివాడేనని తెలిసి, రాజు వెంటనే అతని జీతం పెంచమని ఉత్తరువిచ్చాడు.

రాజోద్యోగి శ్రవణానందుడికి సంతోషంగా వెయ్యివరహాలూ ఇస్తూ, ''నువు నాకు చేసిన మేలుకు ఈ బహుమానం చాలదు,'' అన్నాడు.

తరవాత ముగ్గురు బంధువులూ శ్రవణానందుడితో, ''నీలో ఇంత శక్తి ఉండి, ఆ మారుమూల పల్లెటూళ్ళో నివురు గప్పిన నిప్పులాగా ఎందుకుంటావు? మా మాటవిని రాజధానికి వచ్చెయ్యి. ఇక్కడ నీ తెలివితేటలు అఖండంగా రాణిస్తాయి,'' అన్నారు.

శ్రవణానందుడు నవ్వి, ''నా విజయాలు క్షణికమైనవి. మీలాగా మీ మీ వృత్తులలో నిలవదొక్కుకుని రాణించటం తేలిక కాదు. మీకన్న నేను నిజంగా గొప్పవాణ్ణి కాలేను. కాని నాకు కావలసినది విజ్ఞానం సంపాదిస్తూ, జీవితం సంతోషంగా గడపడం. అది మా వూళ్ళో నాకు సాధ్యమే,'' అన్నాడు.

అతని వినయం చూసి అందరూ సంతోషించారు.






## 2

ఇంద్రుడు చేసిన విశిష్టకార్యాలలో వృత్రుణ్ణి ధ్వంసం చెయ్యటం ఒకటి. ఋగ్వేదంలో 70 సార్లు అతన్ని ''వృత్రహనుడు''గా పేర్కొన్నారు. నిజానికి వృత్రహననంలో ఇంద్రుడితోబాటు అగ్నికీ, మరుత్తులు మొదలైనవారికీ కొంత పాలు లేకపోలేదు. వృత్రుణ్ణేగాక, ఉరణ, విశ్వరూప, అర్బుద మొదలైన రాక్షసులను కూడా ఇంద్రుడు చంపాడు. ఇలా రాక్షసులను చంపినప్పుడల్లా ఇంద్రుడు సోమాన్ని తనకు భుక్తం చేసుకున్నాడు.

ఇంద్రుడు పర్వతాలకూ, మైదానాలకూ గల కంపనాన్ని ఆపాడట. (పురాణ సాహిత్యంలో ఇంద్రుడు పర్వతాల రెక్కలను ఖండించినట్టు చెప్పి ఉన్నది.) ఇంద్రుడు భూమ్యాకాశాలను వేరుచేసి నిలబెట్టాడు. ఈ రెంటినీ ఎవరో రాక్షసుడు ఏకంచెయ్యగా, ఇంద్రుడు వాణ్ణి చంపి, రెంటినీ వేరుచేశాడనికూడా చెప్పి ఉన్నది.

ఆర్యులు తమ శత్రువులతో పోరాడవలసి వచ్చినప్పుడల్లా వాళ్ళు ఇంద్రుణ్ణి స్మరించారు; ఆవాహన చేశారు. అతను ''నల్లని'' వాళ్ళను జయించాడు; 50 వేలమంది నల్లని వాళ్ళను తరిమికొట్టి, వాళ్ళ పట్టణాలను ధ్వంసం చేశాడు; దస్యులను ఆర్యులకు దాసులనుచేసి, ఆర్యులకు భూమి ఇచ్చాడు. సప్తసింధు దేశంలో దస్యుల ఆయుధాలను ఆర్యుల మీద నుంచి మళ్ళించాడు.

ఇంద్రుడు తనను నమ్మినవారి పట్ల చాలా దయగలవాడు, సహాయకారి. తనను ఆరాధించిన వారికి మిత్రుడు, సోదరుడు, తండ్రి! అతనికి కుశికవంశం పట్ల ప్రత్యేకాభిమానమట; ఒకసారి



ఒకసారి సూర్యుడి రథానికీ, ఏతశ అనే గుర్రం ఈడ్చే రథానికీ పోటీపడిందట. సూర్యుడి రథం ముందు పోతుంటే ఇంద్రుడు కలిగించుకుని, సూర్యుడి రథం చక్రాలలో ఒకటి ఊడగొట్టాడట. అందుకేనేమో, సూర్యుడి రథానికి ఒకే చక్రమని చెబుతారు.

పణి అనే తెగకు చెందిన లోభులు యజ్ఞంలో బలి చెయ్యటానికి గోవులను ఇయ్యలేదట. వాటిని వాళ్ళు ఏక్కడో గుహలో దాస్తే, ఇంద్రుడి దూత అయిన సరమా వాటిని వెతుక్కుంటూ వెళ్ళి, ఇంద్రుడి కోసం గోవులను అడిగిందట. పణులు ఆమెను వేళాకోళం చేశారట. ఇంద్రుడు వాళ్ళను జయించి, గోవులను తీసుకున్నాడట.

అతన్ని కౌశికుడు అని కూడా పేర్కొన్నారు. అతను సమస్త సంపదకూ మూలం. అతని యుద్ధాలను "గవిష్టి" (గోవుల మీది కోరిక) అనేవారు. అతను తరచు గోవులనే ఇచ్చేవాడు. ఒక్కొక్కసారి అతను భార్యలనూ, పిల్లలనూ కూడా ఇచ్చేవాడు. ఋగ్వేదంలో "మఘవుడు" (పుష్కలంగా ఇచ్చేవాడు) ఇంద్రుడే. అతనే "వసుపతి" (సంపదకు నాథుడు).

ఇంద్రుడి వీర కృత్యాలు అనేకం చెప్పబడి ఉన్నాయి. అతను ఉషస్సు యొక్క బండిని పగలగొట్టాడు. వాహనాలను చంపాడు. ఉషస్సు భయపడి పారిపోయింది.

ఇంద్రుడు దాసులనూ, దస్యులనూ జయించినట్టు చాలాసార్లు చెప్పి ఉన్నది. వీళ్ళు మనుషులు. వీళ్ళు చట్టిముక్కు గల, నల్లనివాళ్ళు. ఇంద్రుడు ప్రత్యేక వ్యక్తులకు కూడా మేలు చేశాడు. అలా ఇంద్రుడు అభిమానించినవారిలో దివోదాస అతిథిగ్వుడు ఒకడు. ఇతని కొడుకు సుప్రసిద్ధుడైన రాజు సుదాసుడు. దివోదాసు శత్రువు శంబరుడు అనే దాసజాతివాడు. ఇంద్రుడు శంబరుణ్ణి దివోదాసు కోసం చంపాడు.

నముచి ఒక అసురుడు. వేద సాహిత్యంలో ఇతని ప్రస్తావన చాలాచోట్ల ఉన్నది. ఇంద్రుడు ఇతని తలను మెలి తిప్పి చంపాడనీ, నీటి నురుగుతో చంపాడనీ కూడా చెప్పి ఉన్నది. (ఇంద్రుడు రాక్షసులను సముద్రపు నురుగుతో చంపటం వృత్రుడి విషయంలో కూడా చెప్పివున్నది.) ఇంద్రుడు నముచి సాన్నిధ్యంలో తాగి రోగం తెచ్చుకుంటే, అశ్వినీ దేవతలూ, సరస్వతీ చికిత్స చేసినట్టు ఋగ్వేదం 10వ మండలంలో ఉన్నది.

ఇంద్రుడు యదు, తుర్వశులను నదులు దాటించాడట. ఇది ఇంచుమించు వాస్తవ చరిత్రకు సంబంధించిన అంశంగా కనబడుతుంది. (యాదవులు శాఖోపశాఖలుగా పెరిగి భరతఖండంలో అనేక ప్రాంతాలకు వ్యాపించి, స్థిరపడ్డట్టు పురాతత్వ పరిశోధనలు రూఢిచేస్తున్నాయట!) ఆర్యుల సంచారజీవితంలో ఇంద్రుడి ప్రమేయం ఉండటం ఈ సంఘటన రుజువు చేస్తున్నది.

ఇంద్రుడూ, సుశ్రవసుడూ కలిసి ఇరవై మంది ఆటవికజాతుల నాయకులనూ, అరవైవేల తొంభైతొమ్మిదిమంది ఆటవిక యోధులనూ నాశనం చేసినట్టు కథ ఉన్నది. అలాగే సుదాసుడి యుద్ధాలన్నీ చారిత్రికమైనవిలాగే కనబడతాయి. దశరాజ్ఞ యుద్ధం అనేది సుదాసు పదిమంది రాజులతో చేసినది. ఇందులో ఇంద్రుడు సుదాసుకు సహాయం చేశాడు. అలా



సహాయం చెయ్యమని వసిష్ఠుడూ, తృత్సుడూ మొదలైన మహర్షులు ఇంద్రుణ్ణి కోరారట. ఇంద్రుడు సుదాసు శత్రువులను పరుష్ణినదిలో పారేశాడట.

వేదకాలపు ఇంద్రుడు వరుణుడితో నైతికవర్తనలోనూ, ఔన్నత్యంలోనూ సరిరాడు. అయినా వరుణుడికి ఉన్నట్టు చెప్పబడిన అంశాలు అనేకం ఇంద్రుడిలో కూడా ఉన్నట్టు చెప్పబడ్డాయి. గౌతముడి భార్య అయిన అహల్యకూ, ఇంద్రుడికీ గల సంబంధం వేదకాలం నాటిదే, పురాణాల కల్పన కాదు.

వరుణుడు ఇంద్రుడికి పూర్వుడని కొందరు పండితులు అంటారు. ఋగ్వేద కాలం సాగినకొద్దీ వరుణుడి ప్రస్తావన చాలాభాగం తగ్గిపోయి, ఇంద్రుడి ప్రశంస మిగిలింది.

పారశీకుల మతగ్రంథమైన 'అవెస్తా'లో ఇంద్రుడి ప్రస్తావన ఉన్నది, కాని ప్రశంస లేదు. వారి లెక్కన ఇంద్రుడు రాక్షసుడు. అలాగే "దేవ" శబ్దానికి అవెస్తాలో గౌరవం ఏమీ లేదు. ఆ గ్రంథం "అసుర" శబ్దాన్ని గౌరవిస్తుంది. వేదాలలో ఉండే మాటలు చాలా అవెస్తాలో ఉన్నాయి. దాన్నిబట్టి వేదాలకూ, అవెస్తాకూ సంస్కృతి ఒకప్పుడు ఒకటే అయి ఉండవచ్చు. వేదాలలో ఒకప్పుడు "అసుర" అనే మాట గౌరవవాచకంగా ఉండటాన్నిబట్టి కూడా ఇది రుజువవుతుంది. కాని ఒక దశలో రెంటికీ మధ్య వైషమ్యం ఏర్పడింది. పది రాజుల (దశరాజ్ఞ) యుద్ధం నుంచే ఈ వైషమ్యం ఏర్పడిందని అంటారు.

పురాణకాలపు ఇంద్రుడు వేదకాలపు ఇంద్రుడితో పోల్చితే గొప్ప యోధుడు కాదు. యజ్ఞాలకాలం వెళ్ళిపోయి తపస్సుకు ప్రాముఖ్యం వచ్చినాక ప్రతి రాక్షసుడూ తపస్సుచేసి, బ్రహ్మవల్లనో, శివుడివల్లనో వరాలుపొంది, ఇంద్రుణ్ణి అవలీలగా జయించారు. అప్పుడు ఇంద్రుడు విష్ణుమూర్తినే గాక దశరథుడు లాటి మానవుల సహాయం కూడా కోరటం జరిగింది!





# విచారగ్రస్తుడు

చాలాకాలం క్రితం సాకేతరాజ్యాన్ని ఏలిన రాజుకు నలుగురు కుమారుల తరవాత అయిదో కుమారుడు కలిగాడు. రాజు వరం కోరుకోమనగా చిన్నరాణి తన కుమారుడికి రాజ్యం కావాలన్నది. ఈ సంగతి విని పెద్దవాళ్ళు నలుగురూ సాకేతను విడిచి వెళ్ళిపోయారు.

వాళ్ళు సపరివారంగా హిమాలయ పర్వతపాదాన్ని చేరారు. వాళ్ళు ఏదైనా నగరాన్ని జయించి, దాన్ని పాలించాలని రాజు అనుకున్నాడు. కాని ఒక ముని వాళ్ళను కొత్త నగరం నిర్మించమన్నాడు. రాజకుమారులు ఆ ముని కుటీరం ఉండే ప్రాంతంలోనే నివాసాలు కల్పించుకున్నారు.





ఆ ముని పేరు కపిలుడు. అందుచేత ఆ జనావాసానికి కపిలవస్తు అని పేరు వచ్చింది. ఆ ప్రాంతంలో శాక (టేకు) వృక్షాలు హెచ్చుగా ఉండినందున వారికి శాక్యులు అని పేరు వచ్చింది. అనేక తరాలు గడిచినాక శుద్ధోదనుడు ఆ వంశానికి రాజు అయాడు. ఒక రాత్రి అతని రాణి అయిన మాయాదేవి, తన శరీరంలోకి ఒక తెల్ల ఏనుగు ప్రవేశించినట్టు కల గన్నది.



రాణి గర్భంలో ఒక మహాత్ముడు ప్రవేశించాడని దైవజ్ఞులు ఆ కలకు అర్థం చెప్పారు. రాణి తన పుట్టింటికి బయలుదేరింది. దారిలో ఆమె లుంబినీ వనంలో విశ్రాంతి తీసుకుంటూ సాల వృక్షం కొమ్మను పట్టుకుని ఉండగా నొప్పులు వచ్చాయి.

రాణి లుంబినీ వనంలోనే ప్రసవించింది. తల్లి, కొడుకులు కపిలవస్తుకు తిరిగి వచ్చారు. రాజు పరమానందంతో వేడుకలు జరపమని ఉత్తరు విచ్చాడు. కాని ఆ ఉత్సవాల మధ్య రాణి తన ఏడు రోజుల కొడుకును మాతృహీనుణ్ణి చేసి వెళ్ళిపోయింది.





రాజకుమారుడికి సిద్ధార్థుడని పేరు పెట్టారు. ఆ మాటకు ఆశయసిద్ధి పొందినవాడని అర్థం. రాజకుమారుడు ఒకనాడు ఉద్యానంలో కూర్చుని ఉండగా బాణం తగిలిన పక్షి ఒకటి అతని ఒడిలో పడింది. అతను బాణాన్ని లాగేసి, పక్షిని కాపాడాడు. ఇంతలో అతని జ్ఞాతి అయిన దేవదత్తుడు అక్కడికి వచ్చాడు.

"ఆ పక్షిని నేను కొట్టాను. దాన్ని నాకు ఇచ్చెయ్యి," అన్నాడు దేవదత్తుడు. కాని సిద్ధార్థుడు పక్షిని ఇయ్యలేదు. ఇద్దరూ రాజసభకు వెళ్ళారు. "ఏ ప్రాణిగాని దాన్ని చంప చూసినవాడికి చెందుతుందా? దాని ప్రాణం కాపాడిన వాడికి చెందుతుందా?" అని సిద్ధార్థుడు అడిగాడు. మంత్రులు అతనికి అనుకూలంగా చెప్పారు.





ఒకనాడు పొలాలు దున్నే ఉత్సవం జరిగింది. రాజకుమారుడు వేడుక చూడబోయాడు. పొలంలో కొందరు కర్షకులు ఒక పామును కొట్టి చంపుతూండటం కనిపించింది. ఈ ప్రపంచంలో మనుగడ హింసతో కూడుకున్నది అని అతను తెలుసుకున్నాడు. అతనికి విచారం పట్టుకున్నది.

సిద్ధార్థుడు అన్తమానమూ లోకం పోకడలను గురించి ఎడతెగక ఆలోచించసాగాడు. మానవుడు ఎల్లప్పుడూ ఘర్షణకూ, హింసకూ ఎర కావలసినదేనా? మనిషికి జీవితంలో సుఖాలు సంతృప్తి ఇయ్యగలవా? మానవజీవితానికి మరే లక్ష్యమూ లేదా? ఇదే అతని ధ్యానం.





ఇల్లు దాటకుండా ఉంటే రాజకుమారుడు చక్రవర్తి అవుతాడనీ, లేకపోతే బుద్ధత్వం పొందుతాడనీ దైవజ్ఞులు చెప్పారు. రాజు అతని కోసం మూడు హర్మ్యాలు నిర్మింపజేశాడు; వేసవికి చలువరాతిదీ, శీతాకాలానికి దారువుదీ, వానాకాలానికి విశాలమైనదీనూ. అతనికి సకలసౌఖ్యాలూ అమర్చబడ్డాయి.

సుప్రబుద్ధుడి కుమార్తె యశోధర గొప్ప సౌందర్యవతి. ఆమె తండ్రి ఆమెకు స్వయంవరం ఏర్పాటు చేశాడు. శుద్ధోదనుడు ఆ స్వయంవరానికి సిద్ధార్థుణ్ణి పంపాడు. స్వయంవర పోటీలలో చాలామంది క్షత్రియకుమారులు పాల్గొన్నారు. అన్ని పోటీలలోనూ సిద్ధార్థుడే నెగ్గాడు.





యశోధర వరమాలను సిద్ధార్థుడి మెడలో వేసింది. వారి వివాహం జరిగింది. సిద్ధార్థుడు తన వధువుతో తన నగరానికి తిరిగి వచ్చాడు. కపిలవస్తులో వైభవంగా వేడుకలు జరిగాయి. తన కొడుకు ఇల్లు వదలడని నిశ్చయించుకుని శుద్ధోదనుడి మనస్సు స్థిమితపడింది.



# పనికిరాని వస్తువులు

మణిపురంలో రామయ్య్య కొబ్బరినూనె వ్యాపారం చేసేవాడు. గానుగ ఆడటానికి గొబ్బరి కురిడీలు పనికి వస్తాయి. కాని అవి తగినన్ని దొరకవు. అందుచేత రామయ్య్య తన అవసరానికి సరిపడా ముదురు కొబ్బరికాయలు తెప్పించి, వాటి నుంచి కొబ్బరి తీసి ఎండబెట్టి, కొబ్బరి పెంకులు అవతల పారేసేవాడు.

ఒకసారి అతని ఇంటికి జనార్దనుడు అనే యువకుడు వచ్చి, ఇంటి ఆవరణలో గుట్టలుగా పడి ఉన్న ఖాళీ కొబ్బరి చిప్పలను చూపించి, "వీటిని ఏం చేస్తారు?" అని అడిగాడు.

"పొయ్యిలో పెట్టుకుంటాం. అంత కన్న అవి దేనికి పనికివస్తాయా?" అన్నాడు రామయ్య్య.

"పెద్ద పెద్ద చిప్పలు నాకు అమ్మితే కొంటాను," అన్నాడు జనార్దనుడు.

చలికాలంలో నీరు కాచుకునేటందుకు తప్ప పనికిరాని ఖాళీ కొబ్బరి చిప్పలను కొని ఏం చేసుకుంటాడా అని ఆశ్చర్య పడుతూ రామయ్య్య సరేనన్నాడు. వీలయినంత వరకు పెద్దవిగా ఉన్న కొబ్బరి డిప్పలను ఏరి, వాటికి కొంత డబ్బు ఇచ్చి జనార్దనుడు తీసుకుపోయాడు.

అటు తరవాత రామయ్య్య కొబ్బరి కాయలను పగల గొట్టించేటప్పుడు ప్రతి కాయకూ రెండు నిండు డిప్పలు వచ్చేటట్టు పగలగొట్టించేవాడు. పది హేను రోజుల కొకమారు వచ్చి, డిప్పలు కొనుక్కుపోయేవాడు జనార్దనుడు. ఇలా ఒక సంవత్సరం పాటు జరిగింది. తరవాత జనార్దనుడు రావడం మానేశాడు.

రెండు నెలలు గడిచాయి.

జనార్దనుడు ఆకులకట్ట అనే గ్రామంలో ఉంటున్నట్టు రామయ్య్యకు తెలుసు.

ఎస్. వి. ఆర్. సత్యనారాయణమూర్తి



ఆ గ్రామం మణిపురానికి పాతికమైళ్ళ దూరాన ఉన్నది. ఒకసారి పనిమీద నగరం వెళ్ళిన రామయ్య పని పెట్టుకుని అకులకట్ట గ్రామం మీదుగా తిరుగు ప్రయాణమయాడు. అకులకట్ట ఊరుచేరి జనార్దనుణ్ణి గురించి అడిగితే, అతని ఇంటికి దారి తెలిసింది.

రామయ్య కొన్ని కొబ్బరి తోటలు దాటి ఒక మామిడితోట మధ్య ఉన్న ఇంటికి చేరుకున్నాడు. అది ఐశ్వర్యవంతుల ఇల్లులాగున్నది. జనార్దనుడు ఆ ఇంటి వారి వద్ద పనిచేస్తూ ఉండవచ్చుననుకున్నాడు రామయ్య. ఇంటి తలవాకిలి సమీపంలో పని చేస్తున్న మనిషిని రామయ్య, "జనార్దనుడు ఉన్నాడా?" అని అడిగాడు.

ఆ మనిషి రామయ్యను ఎగా దిగా చూసి, లోపలికి వెళ్ళమని దారి చూపించాడు. ఆ ఇల్లు జమీందారీ భవనంలా ఉన్నది. మేడ మీద కొంతమందితో మాట్లాడుతున్న వ్యక్తి జనార్దనుడి లాగే ఉన్నట్టు కనిపించాడు. కాని చాలా విలువైన దుస్తులు ధరించి ఉన్నాడు. అతను పై నుంచి రామయ్యను చూస్తూనే, రామయ్యను లోపలికి తీసుకురమ్మని ఒక మనిషిని పంపి, తాను మేడదిగాడు.

కింద హాలులో రామయ్యా, జనార్దనుడూ కలుసుకున్నారు. జనార్దనుడి అవతారమూ, ఠీవీ చూసి రామయ్య ఆశ్చర్యపోయాడు.

"రామయ్యగారూ, నా ఇల్లూ, వ్యవహారమూ చూసి మీకు చాలా ఆశ్చర్యంగా ఉన్నది కదూ? కొబ్బరి చిప్పలు కొనుక్కుపోయిన వాడికి పట్టు బట్టలూ, మేడా ఎలా వచ్చాయనుకుంటున్నారు కదూ! ముందు నా ఆతిథ్యం స్వీకరించండి. తరవాత అన్ని విషయాలూ మాట్లాడుకోవచ్చు." అన్నాడు జనార్దనుడు.

విందు భోజనం ముగించి, కచేరీగదిలో విశ్రాంతి తీసుకుంటూ జనార్దనుడు రామయ్యకు తన కథ ఇలా చెప్పాడు:

ఒకప్పుడు మాది జమీందారీ వంశం. మా తాత తండ్రులు ముందూ, వెనకా చూడకుండా దానధర్మాలు చేసి, చితికి పోయారు. నాకు జ్ఞానం తెలిసేనాటికి ఆ తాత తండ్రులూ లేరు, ఆస్తీ లేదు!

ఇక్కడికి దగ్గిరలో వున్న కోటిపల్లి జమీందారు సుందరయ్యగారు వస్తున్న బండి ఒకనాడు ప్రమాదవశాన తిరగబడింది. సమయానికి అటువచ్చిన నేను ఆయనను బండిలో నుంచి పైకి లాగాను. బండివాడూ, నేనూ కలిసి బండిని సరిగా నిలబెట్టినాక నేను ఆయనను వారి ఇంటికి చేర్చాను.



మాటల సందర్భంలో ఆయన నా పరిస్థితి గురించి విని చాలా విచారించారు.

"ఎందుకండీ విచారం? ఎందుకూ పనికిరావని మామూలుగా అందరూ అనుకునే వస్తువుల సహాయంతో ఒక్కొక్కప్పుడు శ్రీమంతుడు అయిపోవచ్చు." అన్నాను గంభీరంగా.

సుందరయ్యగారు నవ్వుతూ, "జనార్దనం, నువ్వన్నట్టు ఎవరికీ పనికిరావనుకునే వాటితో నువు ధనం సంపాదించగలిగితే, నా ఒక్క కూతురినీ నీ కిచ్చి వివాహం చేస్తాను. నీకు పెట్టుబడి కావలిస్తే తీసుకో" అన్నారు.

నేను ఆయనవద్ద కొంత సొమ్ము అప్పుగా మాత్రమే తీసుకుని, బొమ్మల మీదా కుండల మీదా రంగులు వేసే వారిని ఇద్దరినీ, పనితనంగల వడ్రంగులను ఇద్దరినీ కుదుర్చుకున్నాను. కొబ్బరి చిప్పలు సేకరించి, వాటితో రకరకాల బొమ్మలూ, ఆటవస్తువులూ, గరిటెలూ వడ్రంగుల చేత చేయించాను. బొమ్మలకు రంగులు వేయించాను. రంగు రంగుల బొమ్మలు కదులుతూ తలలు ఊపుతూ ఆకర్షణీయంగా ఉండటం చేత, అవి ఈ చుట్టుపక్కల జరిగే సంతలలోనూ, పట్నంలోనూ మంచి ధరకు విరివిగా అమ్ముడు పోయాయి.

అదేసమయంలో ఎక్కడెక్కడి కొబ్బరి మట్టలూ కొని తెప్పించి, అడ కూలీలను నియమించి కొబ్బరిఆకుల నుంచి ఈనెలు తీయించి, చీపుళ్లు తయారుచేయించాను. నా బొమ్మలూ, చీపుళ్ళూ, కొబ్బరి కాయలూ మధ్యదేశంలో అపురూపంగా ఉండి, వాటికి గిరాకీ ఉండేది. అక్కడ చవుకగా దొరికే వస్తువులు తెప్పించి, ఇక్కడ మంచి ధరలకు అమ్మి అటూ, ఇటూ కూడా వ్యాపారం సాగించి, సంవత్సరం లోపల చాలా డబ్బు గడించాను. ఆరంభంలో నాకు ముడిసరుకు మీ నుంచి లభించింది. మీరు కొబ్బరినూనె వ్యాపారం చేస్తారు గద! డబ్బు బాగా చేరినాక ఆకులకట్టలో స్థిరపడ్డాను. ఎందుకంటే ఇక్కడ కొబ్బరితోటలు జాస్తి.

సుందరయ్యగారు నాకృషిచూసి మెచ్చుకుని, ''కేవలమూ కొబ్బరి డిప్పలతోనూ, కొబ్బరిమట్టలతోనూ వ్యాపారం చేసి ఇంత ధనం సంపాదించావంటే నాకు నిజంగా ఆశ్చర్యంగా ఉన్నది. అందరూ నీలాగా ప్రయత్నిస్తే సాధించరానిది ఉండదేమో!'' అని తాను అన్న ప్రకారం నాకు తన కుమార్తెను రుక్మిణిని ఇచ్చి వివాహం చేశారు.

నేను వారి జమీవ్యవహారాలన్నీ చూస్తూ, ఈ ఆకులకట్టలో వారి భవనంలోనే ఉంటున్నాను. వారు మాత్రం కోటిపల్లిలోనే ఉంటున్నారు. ఇదీ నా కథ!

రామయ్య జనార్దనం కథ విని చాలా సంతోషించి, ''జనార్దనంగారూ, మీరు యువకులకు ఒక చక్కని బాట చూపారు. మీలా అందరూ ఏదో ఒక పథకం ఆలోచించుకుని ముందుకు సాగితే, బాగుపడటానికి ఎన్నో మార్గాలుంటాయి,'' అన్నాడు.

తరవాత ఆయన జనార్దనం నడుపుతున్న గృహపరిశ్రమలన్నీ స్వయంగా చూసి, తాను బాగుపడటమేగాక అనేక మందికి ఉపాధి కలిగించిన జనార్దనాన్ని అభినందించి తన ఇంటికి బయలుదేరాడు.





# సధర్ముడు

సాయంకాలం కాలవ గట్టుకు షికారు వెళ్ళిన లక్ష్మీపతి కొంచెం చీకటిపడి ఇంటికి తిరిగి వస్తూండగా, మామిడితోపు మధ్య ఇద్దరు మనుషులు, చేతిలో కత్తులతో అటకాయించారు. ఒకడు లక్ష్మీపతి చేతులు వెనక్కి విరిచిపట్టుకున్నాడు. రెండోవాడు లక్ష్మీపతి జేబులో ఉన్న డబ్బులూ, చేతికి ఉన్న ఉంగరమూ లాగేసుకున్నాడు. లక్ష్మీపతి పెనగులాడుతూంటే, ''పీక కోసేసి పోతే మంచిదేమో!'' అన్నాడు చేతులు పట్టుకున్న వాడు. డబ్బులు కాజేసినవాడు కత్తి మొన తెచ్చి లక్ష్మీపతి పీకకు గట్టిగా ఆనించాడు.

''రక్షించండి!'' అంటూ లక్ష్మీపతి చావుకేక పెట్టాడు.

మరుక్షణంలో, ''ఎవర్రా వాళ్ళూ? తండ్రిలాంటి వాణ్ణి చంపటానికి చేతులు ఎలా వచ్చాయిరా?'' అంటూ ఎవరో యువకుడు పరిగెత్తుకుంటూ వచ్చి వాళ్ళ మీద పడ్డాడు. దొంగలు లక్ష్మీపతిని వదిలేసి, ఆ యువకుణ్ణి ఎదుర్కొని, వాడి ధాటికి తట్టుకోలేక పారిపోయారు.

సగం చచ్చి చతికిలపడి ఉన్న లక్ష్మీపతి ఆ యువకుడికి చేతులు జోడించి, ''సమయానికి దేవుడిలా వచ్చి కాపాడావు. నీ మేలు మరవను. దయచేసి, నన్ను మా ఇంటికి చేర్చు.'' అన్నాడు.

''అదేం మాట, బాబూ! మీరు పెద్దవారు, నాకు దణ్ణం పెట్టకూడదు. ఆపదలో ఉన్న వాళ్ళను రక్షించనివాడు మానవుడేకాడు! పదండి, మీ ఇంటికి వెళదాం,'' అంటూ ఆ యువకుడు చెయ్యి ఊత ఇచ్చి లక్ష్మీపతిని లేవదీశాడు.

దారిలో లక్ష్మీపతి అతన్ని గురించి కొంత తెలుసుకున్నాడు. అతని పేరు

మాచిరాజు కామేశ్వరరావు



ధర్మరాజు. చిన్నతనంలోనే తల్లిదండ్రులు పోయారు. ఊరివాళ్ళ సహాయంతో చదువుకుని, ఉద్యోగప్రయత్నం మీద ఈ ఊరు వచ్చాడు. ఇంకా బస ఏర్పాటు చేసుకోలేదు.

ఇంటికి చేరుతూనే లక్ష్మీపతి తన కూతురికి జరిగినదంతా చెప్పి, ''ఈ ధర్మరాజు సమయానికి రాకపోతే, ఈపాటికి నా శవమే ఇల్లు చేరి ఉండేది!'' అన్నాడు.

కల్యాణి కంటనీరు పెట్టుకుని, ''ఒంటరిగా చీకటిపడినదాకా తిరగవద్దంటే వినవు! నా అదృష్టం బాగుండి, ఇవాళ సమయానికి ఆయన వచ్చారు!'' అంటూ ఆమె ధర్మరాజుకు తన కృతజ్ఞతలు చెప్పుకున్నది.

''ఇక నాకు సెలవిప్పించండి!'' అన్నాడు ధర్మరాజు.

''అదేమిటి? ఈ చీకట్లో బస ఎక్కడ వెతుక్కుంటావు? నువు మా అతిథివి!'' అన్నాడు లక్ష్మీపతి.

కల్యాణి వెంటనే ధర్మరాజు కోసం ఒక గది సిద్ధం చేసింది.

భోజనాల దగ్గిర లక్ష్మీపతి ధర్మరాజుతో, ''నాకు లక్షలకొద్దీ ఆస్తి ఉన్నది. అయితే మా కల్యాణిని ఒక సధర్ముడి చేతిలో పెట్టినదాకా నాకు సంతృప్తి లేదు,'' అన్నాడు.

మర్నాడు ఉదయం ధర్మరాజు లక్ష్మీపతితో, ''ఇక నేను వెళ్ళి ఉద్యోగం కోసం వెతుక్కుంటాను,'' అన్నాడు.

''ఇంకా వెతుక్కనేదేమిటి? ఉద్యోగం వచ్చేసినట్టే! ఈ ఊళ్ళో నాకు నాలుగు బట్టల దుకాణాలున్నాయి. అందులో ఒకటి నువు చూసే పని ఇస్తాను,'' అన్నాడు లక్ష్మీపతి.

ధర్మరాజు మొహమాటపడుతూనే అందుకు ఒప్పుకున్నాడు.

తండ్రి మంచి పనే చేశాడన్నది కల్యాణి. కాని త్వరలోనే ఆమెకు ధర్మరాజు మీద సదభిప్రాయం పోయింది.

అతను తన తండ్రి ఉన్నప్పుడు ఒక లాగూ, లేనప్పుడు మరొక లాగూ ప్రవర్తిస్తున్నాడు! కల్యాణిని ఆకర్షించడానికి వెకిలి చేష్టలు చేస్తున్నాడు!

ఆమె ఒకసారి తండ్రితో, "ధర్మరాజు మన ఇంట్లో ఎంతకాలమని ఉంటాడు. అతనికి వేరే ఇల్లు చూడు," అన్నది.

"అదీ నిజమే! అతను పరాయివాడుగా మన ఇంట్లో ఎంతకాలం ఉంటాడు. అతను సద్ధర్ముడు! నిన్ను పెళ్లి చేసుకోవడానికి ఇష్టపడుతున్నాడు. మనం కోరినట్టు ఇల్లరికం ఉండిపోగలడు! నువ్వేమంటావు?" అన్నాడు లక్ష్మీపతి.



కల్యాణి ఈ మాట విని నిర్ఘాంత పోయింది. తనతో ముందు చెప్పకుండా ఈ విషయం తన తండ్రి ధర్మరాజుతో చర్చించటంతో తనకు అవమానం జరిగినట్టు ఆమె భావించింది. ఆమె తన స్నేహితురాలి అన్న రాజేశాన్ని ప్రేమించి ఉన్నది. కాని ఆ సంగతి ఆమె తన తండ్రికి చెప్పలేదు. రాజేశం తన కులం వాడు కాడు.

"అతను సద్ధర్ముడు అని ఎలా తేల్చావు?" అని ఆమె తండ్రిని అడిగింది.

లక్ష్మీపతికి కోపం వచ్చింది.

"పిచ్చిగా మాట్లాడకు! నేను మనుషులను అర్థం చేసుకోగలను. పైమాసం నీకూ, అతనికీ పెళ్ళి ఖాయం!" అన్నాడాయన.

ఆమె తండ్రితో ఏమీ అనలేక, విసురుగా బయటికి వస్తూ, ధర్మరాజు తమ సంభాషణ ఆలకిస్తూ ఉండినట్టు తెలుసుకున్నది. ధర్మరాజు చప్పున తన గదిలోకి వెళ్ళిపోయాడు.

ఆ రాత్రి కల్యాణికి ఆలోచనలతో నిద్ర రాలేదు. తన కర్తవ్యం గురించి రాజేశంతో చర్చించటానికి ఆమె నిశ్చయించుకున్నది. ఇంతలో ధర్మరాజు గదిలో నుంచి చావుకేక వినిపించింది. ఇంకా మేలుకునే ఉన్న కల్యాణి చప్పున అతని గదిలోకి పరిగెత్తింది.



ధర్మరాజు మంచం మీద బిగుసుకు పోయి కూర్చుని ఉన్నాడు. మంచం రెండో చివర తెల్ల గండుపిల్లి ఒకటి నిలబడి ఉన్నది.

కల్యాణిని చూడగానే అతను, ''పిల్లి! దాన్ని తరిమెయ్యి!'' అని గొణిగాడు.

అతను పిల్లిని చూసి అలా భయపడ డంతో కల్యాణి ఆశ్చర్యపోయింది.

''అది ఏమీ చెయ్యదు! పెంపుడు పిల్లి!'' అంటూ కల్యాణి పిల్లిని ఎత్తు కున్నది.

''నాకు పిల్లి అంటే అసహ్యం! ఏమీ చేస్తుందని కాదు,'' అన్నాడు ధర్మరాజు సర్దుకుంటూ.

కల్యాణికి ఆ మాటలో నమ్మకం కుదర లేదు. ఆమె పిల్లితోసహా తన గదికి వెళ్ళి పోయింది. మర్నాడు ఆమె రాజేశాన్ని కలుసు కుని, రాత్రి జరిగినది చెప్పి, ''ధర్మరాజు మా నాన్నను వలలో వేసుకున్నాడు. గండు పిల్లిని చూసి చావుకేక పెట్టిన వాడు మా నాన్నను హంతకుల నుంచి ఎలా కాపాడి ఉంటాడు?'' అన్నది.

''వాడిగుట్టు నేను రట్టుచేస్తాను. మనం ముందు ఒక విషయం రూఢి చేసుకోవాలి!'' అంటూ రాజేశం ఆమెకు ఒక ఆలోచన చెప్పాడు.

మర్నాడు సాయంత్రం కల్యాణి ధర్మ రాజుతో, ''కొండ మీది కామాక్షి ఆల యానికి పోదామనుకుంటున్నాను, తోడు వస్తావా?'' అన్నది.

ధర్మరాజు సంతోషంగా ఆమె వెంట బయలుదేరాడు. వాళ్ళు దేవి దర్శనం చేసుకుని కొండ దిగేటప్పుడు చీకటి పడుతున్నది. ముందు అనుకున్న ప్రకారం రాజేశం ఒక చెట్టు చాటు నుంచి చప్పున ముందుకు వచ్చి, కల్యాణి మెడలో హారం తెంపుకున్నాడు.

''దొంగను పట్టుకోండి! పదివెల హారం!'' అని కల్యాణి అరిచింది.

రాజేశం పారిపోయే ప్రయత్నం చెయ్యక, అక్కడే నిలబడి, ధర్మరాజుతో,

"వస్తావురా? రా! నీ కంఠం పిసికి, కొండకింద నీ శవాన్ని గిరవాటు వేస్తాను!" అంటూ జబ్బలు చరుచుకున్నాడు.

ధర్మరాజు నిలుచున్న చోటునుంచి కదలక, నిలువునా వణికి పోతున్నాడు. ఎవరో అటుగా వస్తూండడం చూసి, రాజేశం దాపులవున్న చెట్ల చాటుకు వెళ్లిపోయాడు.



"హారం పోతేపోయింది. ప్రాణాలు దక్కాయి! పోదాం పదండి!" అన్నది కల్యాణి.

మర్నాడు కల్యాణి తనను కలుసుకున్నప్పుడు రాజేశం, "రూఢి అయి పోయింది! ధర్మరాజు బొత్తిగా పిరికి వాడు. కిరాయి దొంగలతో నాటకం ఆడించి, మీ ఇల్లు చేరి, నిన్ను పెళ్ళాడి, మీ ఆస్తికి వారసుడు కావాలని ఎత్తు వేశాడు! వాడి ఆట నేను కట్టిస్తాను, నువు ఇలా చెయ్యి," అంటూ ఆమెకు మరొక ఆలోచన చెప్పాడు.

మర్నాడు సాయంత్రం రాజేశం లక్ష్మిపతిని కలుసుకుని, "నా పేరు రాజేశం. నేను మీ మేలు కోరి ఒక్క సంగతి మీకు తెలియజేయడానికి వచ్చాను. మీరు అల్లుణ్ణి చేసుకోబోతున్న ధర్మరాజు అసలు రూపం తెలుసుకోదలిస్తే నా వెంట రండి," అన్నాడు.

లక్ష్మిపతికి వెళ్ళాలనిపించలేదు, కాని ఆ రాజేశం మాటల చాటున ఏదో భయంకర సత్యం ఉండవచ్చునని తోచి అతని వెంట వెళ్ళాడు.

చీకటిపడి ధర్మరాజు ఇంటికిరాగానే, కల్యాణి అతనితో, "నీ కోసం ఇద్దరు మనుషులు వచ్చారు. వాళ్ళు నీ కేదే మహోపకారం చేశారట! అందుకు తగిన ప్రతిఫలం నీనుంచి వాళ్ళకు ముట్ట లేదుట! ఇప్పుడు వాళ్ళను కలుసుకో మన్నారు," అంటూ రాజేశం ఇంటి గుర్తులు చెప్పింది.

ఈ మాటలు వింటూ ధర్మరాజు ముఖం రంగులు మారింది. అతను వెంటనే

బయలుదేరి రాజేశం ఇంటికి వెళ్ళాడు. రాజేశం ఈలోపల ఇంటి ముందుగదిలో దీపం తగ్గించి, "త్వరలోనే ధర్మరాజు ఇక్కడికి వస్తాడు. అతని మాటలు శ్రద్ధగా వినండి," అని లక్ష్మీపతితో అన్నాడు.

ధర్మరాజు వస్తూనే చీకటిగదిలో ఇద్దరు మనుషులున్నట్టు గమనించి, కోపంగా, "మీకేమయినా మతిపోయిందా? తిన్నగా మామగారు కాబోయే ఇంటికే వస్తారా? ఆయన మిమ్మల్ని గుర్తుపట్టి ఉంటే ఏమయేది? మీరు చేసిన దానికి రెట్టింపు మీకు అదివరకే ముట్టింది! నేను ఇచ్చిన వందా కాక, ముసలాడి డబ్బూ, ఉంగరమూ పుచ్చుకున్నారు! మీ ఆశకు అంతులేదా! పెళ్ళికాగానే ముసలాణ్ణి మూల కూర్చొబెట్టి, పెత్తనం చేతిలోకి తీసుకుంటాను. అంతదాకా ఓపికపట్టండి. ఈ లోపుగా మీరు ఆ చాయలకు వచ్చారంటే, అసలుకే మోసం!" అని నోటికి వచ్చినట్టు వాగాడు.

ఆ సమయంలో రాజేశం దీపం వత్తి పెద్దది చేశాడు. ఆ వెలుగులో లక్ష్మీపతినీ, రాజేశాన్నీ చూడగానే ధర్మరాజు నోరు వెళ్ళబెట్టాడు.

అప్పుడే కల్యాణి లోపలికి వచ్చి, "చూశారా, నాన్నా? సధర్ముడూ, స్వకులస్థుడూ అంటూ ఈ పచ్చి మోసగాణ్ణి నెత్తిన పెట్టుకున్నారు! ఇతడినుంచి మనని ఈ రాజేశం కాపాడకపోతే మనపాట్లు కుక్కలుకూడా పడేవికాదు." అన్నది.

లక్ష్మీపతి ధర్మరాజు కేసి అసహ్యంగా చూసి, "నువు వెంటనే నా ఎదటనుంచి వెళ్ళకపోతే నిన్ను రక్షకభటులకు వప్పగిస్తాను!" అన్నాడు.

అవకాశం దొరికినదే చాలునని ధర్మరాజు నిష్క్రమించాడు.

రాజేశం ఏ కులస్థుడైనా అతనే నిజమైన సధర్ముడు అని, కల్యాణిని రాజేశానికి ఇచ్చి పెళ్ళి చెయ్యటానికి లక్ష్మీపతి ఒప్పుకున్నాడు.





# ఆడదాని కోరిక

శారదమ్మ వితంతువు. ఆమె కక్కుర్తి మనిషి. ఆమె కొడుకు రామానికి కొత్తగా పెళ్ళి అయింది. ఆ సంబంధం చేసుకున్నందుకు తన వియ్యంకుడి నుంచి వీలయినంత కట్నం రాబట్టి, ఆయనగారు దివాలా ఎత్తినంత పని చేయించింది శారదమ్మ. రామం మామగారు ఉగాది పండగకు అల్లుణ్ణీ, కూతుర్నీ రమ్మనమని కబురంపాడు.

వాళ్ళు రెండు రోజుల్లో బయలుదేరుతారనగా శారదమ్మ కొడుకును చాటుగా పిలిచి, ''నాయనా, మీ మామగారిని ఉంగరం చేయించి పెట్టమని అడుగు. కొత్త అల్లుడివి, నీ కోరిక కాదనరు!'' అన్నది.

రామం తల్లి మాటలకు చిరాకుపడి, ''అమ్మా, ఇప్పటికే మామగారు పెళ్ళికి బోలెడంత ఖర్చు చేసి, బాగా చితికిపోయి ఉండాలి. ఇప్పుడాయనను ఉంగరం అడగడం సబబుగా ఉంటుందా?'' అన్నాడు.

''నాయనా, నీ చేతిన ఉంగరం చూడాలని నా కోరిక. తల్లి కోరిక బిడ్డ తీర్చాలి, భార్య కోరిక భర్త తీర్చాలి,'' అన్నది తల్లి.

రామం తల్లితో సరే లెమ్మన్నాడు. అతను ఉగాదికి భార్యను వెంటబెట్టుకుని అత్తవారింటికి వెళ్ళి, పండగ వెళ్ళిన తరవాత నాలుగు రోజులుండి, తిరిగి భార్యతోసహా ఇంటికి వచ్చేశాడు.

కొడుకు చేతికి ఉంగరం ఉండడం చూసి, శారదమ్మ మురిసిపోయింది, ఉంగరం చాలా బాగున్నదని మెచ్చుకున్నది కూడా.

కొద్ది రోజులు గడిచాయి. ఒకనాడు శారదమ్మ రామంతో, ''నాయనా, అటక

కె. శరత్‌చంద్రరెడ్డి

మీది పెట్టెలో వెయ్యి రూపాయలు దాచి ఉంచాను. ఆ డబ్బు కనిపించడం లేదు. నువ్వేమైనా చూశావా ?'' అన్నది.

శారదమ్మ రామానికి వచ్చిన కట్నంలో కొంత భాగం అటక మీద దాచి ఉంచింది అది కనిపించటం లేదు!

'' అవునమ్మా! నేను అత్తవారింటికి వెళ్ళేటప్పుడు ఆ వెయ్యి రూపాయలూ పట్టుకుపోయాను. మామగారు చితికి పోయి ఉంటారని నేను ముందే చెప్పాను గదా! నువ్వేమో నా చేతిన ఉంగరం చూడాలని ముచ్చటపడితివి. నేను అనుకున్నంతా అయింది. మామగారు ఆర్థికంగా చాలా దెబ్బతిని ఉన్నాడు. అందుకని మన డబ్బుతోనే ఉంగరం చేయించుకున్నాను—నీ ముచ్చట తీరడానికి!'' అన్నాడు రాఘం.

శారదమ్మ నిర్ఘాంతపోయి, '' ఒరే, నా డబ్బుతో ఉంగరం చేయించుకోవడానికి నీ మనస్సెలా ఒప్పిందిరా ? '' అన్నది.

'' తల్లి కోరిక బిడ్డ తీర్చాలని నువ్వే గదా లోగడ అన్నావు ? '' అని రామం అడిగాడు.

'' అలాగే అనుకుందాం! నా కోరిక తీర్చావుగా, ఆ ఉంగరాన్ని మళ్ళీ అమ్మి, ఆ డబ్బు తెచ్చి నాకు ఇచ్చెయ్యి.'' అన్నది శారదమ్మ.

'' ఇంకా ఆ ఉంగరం నా దగ్గిర ఉన్నదనుకున్నావా, అమ్మా ? నీ కోడలు ముచ్చటపడి, పట్టుచీర కావాలని కోరితే, ఉంగరాన్ని అమ్మి, ఆ డబ్బుతో మంచి జరీ పట్టుచీర కొని తెచ్చి ఇచ్చాను,'' అన్నాడు రామం.

'' ఎంతపని చేశావురా ? '' అంటూ శారదమ్మ బావురుమన్నది.

'' నువ్వేగదమ్మా, భార్య కోరిక భర్త తీర్చాలని అన్నావు ?'' అని రామం తల్లినడిగాడు.

దానికి ఏం సమాధానం చెప్పాలో ఎంత ఆలోచించినా శారదమ్మకు తెలియలేదు.





# దేవీ భాగవతం

భర్త ఇచ్చిన శాపం వల్ల ఆడగుర్రమైన లక్ష్మి ఆ భర్తకే ఒక పిల్లవాణ్ణి కని, శాపంతీరి భర్తతో సహా వైకుంఠానికి తిరిగి పోతూ, తన కొడుకును నదీతీరపు అరణ్యంలో వదిలిపెట్టి వెళ్ళిన కొద్ది సేపటికి, చంపకుడు అనే విద్యాధరుడు మదాలస అనే తన భార్యతో విమానంలో అటుగావచ్చి, అసాధారణమైన తేజస్సు గల ఆ శిశువును చూసి, విమానం నుంచి దిగి, ఆ పిల్లవాణ్ణి తీసుకుని మదాలసకు ఇచ్చాడు. మదాలస అమితానందంతో ఆ బిడ్డను తీసుకుని మూర్కొని, తన రొమ్ముకు గట్టిగా అదుముకుని, ఒడిలో పెట్టుకుని, తన భర్తతో, "ఎవరీ పిల్లవాడు? నీకు ఎలా దొరికాడు? వీణ్ణి ఎవరు కని, ఈ అడవిలో పారేసిపోయి ఉంటారు?" అన్నది.

"ఈ బిడ్డ ఎవరో ఇంద్రుణ్ణి అడిగి, ఆయన సరే నంటే పెంచుకుందాం," అంటూ చంపకుడు ఇంద్రుడి వద్దకు వెంటనే వెళ్ళాడు.

అతను ఇంద్రుడికి ఆ బిడ్డను చూపి, "ఈ బిడ్డ ఎవరో తెలీదు. తమసానదీ తీరానదొరికాడు. ఎవతో వీణ్ణి ఆ ప్రాంతంలో కని పారేసి పోయింది. నువు అనుమతిస్తే వీణ్ణి యింటికి తీసుకుపోయి పెంచుకుంటాను," అన్నాడు.

అప్పుడు ఇంద్రుడు చంపకుడితో, "గుర్రాలరూపంలో ఉన్న లక్ష్మినారాయణులకు వీడు పుట్టాడు. హైహయుడు

## 21. హైహయుడి కథ




అనదగిన ఈ శిశువును విష్ణువు, యయాతి కొడుకు తుర్వసుడికి పెంపుడు ఇచ్చే ఉద్దేశంతో కన్నాడు. అందుచేత నువు ఈ పిల్లవాణ్ణి వెంటనే అక్కడ వదిలెయ్యి. విష్ణువు ప్రేరణతో తుర్వసుడు త్వరలోనే అటుగా వస్తాడు. ఏకవీరుడని వీడికి పేరు వస్తుంది," అన్నాడు.

ఆ మాట విని చంపకుడు ఆ పిల్లవాణ్ణి తీసుకుపోయి, ఎక్కడ దొరికాడో మళ్ళీ అక్కడే పెట్టేసి, తన దారిన తాను పోయాడు.

ఇంతలో విష్ణువు యయాతికొడుకుకు కనిపించాడు. ఎంతో పుణ్యాత్ములకు గాని కలగని విష్ణు దర్శనం తనకు కలిగినందుకు పరమానందం చెంది, తుర్వసుడు ఎంతో భక్తితో ఆ దేవుణ్ణి స్తోత్రం చేశాడు.

"నీ కోరిక ఏమిటి?" అని విష్ణువు అతన్ని అడిగాడు.

"కొడుకు!" అన్నాడు తుర్వసుడు.

"నీ కోసం లక్ష్మికి నేను ఒక కొడుకును కన్నాను. వాడు తమసా కాళిందీ సంగమం వద్ద ఉన్నాడు. వెళ్ళి తెచ్చుకో," అన్నాడు విష్ణువు.

తుర్వసుడు పరమానంద భరితుడై విష్ణువు చెప్పిన చోటికి వెళ్ళి, తన కాలి బొటనవేలు నోట పెట్టుకుని ఆడుకుంటున్న శిశువును చూసి, వాడి అందానికి ఆశ్చర్యపోతూ, వాణ్ణి చేతుల్లోకి తీసుకుని, "నాయనా, అతికష్టమైన తపస్సు చేస్తే విష్ణుమూర్తి నిన్ను నాకు ఇచ్చాడురా! నా వంశం నిలబెట్టు!" అంటూ ఆనందోత్సాహంతో మునిగి తేలుతూ, వెంటనే బయలుదేరి తన నగరానికి వెళ్ళాడు.

రాజభవనమంతా ఉత్సవాలతో నిండిపోయింది. హరివర్మ అనే మరో పేరు కూడా గల తుర్వసుడు బిడ్డను తన భార్యకు ఇచ్చి, ఆ బిడ్డ తనకు దొరికిన కథ అంతా ఆమెకు చెప్పాడు. పిల్లవాడికి ఏకవీరుడు అని నామకరణం చేశారు.

వాడు చక్కగా పెరిగి రాసాగాడు. వాడికి ఆరు నెలలు నిండగానే అన్నప్రాశనా, మూడేళ్ళకు పుట్టు వెంట్రుకలు తీయించ టమూ చేశారు. పదకొండవ ఏట ఉప నయనం జరిగింది. వేదమూ, ధనుర్వే దమూ అభ్యసించాడు.

యుక్తవయసురాగానే ఏకవీరుడికి అతని తండ్రి వైభవంగా పట్టాభిషేకం జరిపించి, భార్యాసమేతంగా వానప్రస్థం వెళ్ళి, పార్వతిని గురించి తపస్సు చేశాడు. కాలక్రమాన భార్యాభర్త లిద్దరూ స్వర్గస్థులైనారు. ఈ వార్త తెలిసి ఏక వీరుడు తన తల్లిదండ్రులకు ఉత్తర క్రియలుచేసి, సుఖంగా రాజ్యం చేయ సాగాడు.

ఒకసారి అతను కుటుంబపరివార సమేతంగా గంగా తీరానికి వెళ్ళాడు. అక్కడ ఋషుల ఆశ్రమాలు చక్కని చెట్లతో పక్షుల కలకలంతో ఎంతో మనో హరంగా ఉన్నాయి. అక్కడి ప్రకృతి సౌందర్యాన్ని తిలకిస్తూ అతను నదీతీరం వెంబడి నడుస్తూ, ఒక చోట ఒంటరిగా ఉన్న ఒక స్త్రీని చూశాడు. ఆమె నదిలో ఉన్న ఒక నూరురేకుల పద్మానికి దక్షిణంగా ఉన్నది. అత్యంత సౌందర్య వతి అయిన ఆ స్త్రీ విచారంలో ఉన్నట్టు కనబడింది.



ఆమెను చూసి ఏకవీరుడు, "ఎందుకు విచారంగా ఉన్నావు? నువు మనుష్య స్త్రీవా? లేక దేవతాస్త్రీ వా? నీ పేరేమిటి? నీ తండ్రి ఎవరు? ఈ కారడవిలో నిన్నె వరు విడిచి పెట్టారు? నీ భర్త ఎవరు? నీ శోకానికి కారణం చెబితే దాన్ని నేను చక్క చేస్తాను—నీ దుఃఖానికి కారకులు మానవులైనా సరే, దానవులైనా సరే, దేవతలైనా సరే!" అన్నాడు.

దానికి ఆమె ఇలా అన్నది:

ఏదో ఒక ఆపద కలగకుండా ఎవరికి గాని దుఃఖం ఎందుకు సంప్రాప్తమవు తుంది? నీ దేశం కాని మరొక దేశానికి రభ్యుడనే వాడు రాజు. అతను గొప్ప



పుణ్యాత్ముడు. అతని భార్య రుక్మరేఖ. ఆమెకు సంతానం లేక పోయింది. ఆమె తన భర్తతో, పిల్లలు లేని జీవితం కన్న స్త్రీకి హైన్యంలేదు గదా అన్నది. భార్య ఇలా అనేసరికి, ఆ రాజు బ్రాహ్మణులను నియోగించి, సంతానం కోసం యజ్ఞం చేయించాడు. అప్పుడు అగ్నికుండం నుంచి బంగారు బొమ్మలాటి అమ్మాయి పుట్టుకొచ్చింది. యజ్ఞం చేయించిన హోత ఆమెను రాజుకు చూపి, 'ఈ పిల్ల ఏకావళి (ఒంటిపేట హారం) లాగా అగ్ని నుంచి పుట్టింది. ఏకావళి అని పేరు పెట్టుకుని, ఈమెను ఈ నాటినుంచి కొడుకులాగా పెంచుకో. ఈమె నీకు విష్ణువు ఇచ్చిన ప్రసాదం!' అన్నాడు.

రభ్యుడు ఎంతో సంతోషించి ఆ పిల్లను తన భార్య అయిన రుక్మరేఖకు అప్పగించాడు. ఆమె కూడా తాను స్వయంగా కొడుకును కన్నంతగా సంతోషించింది. ఆ పిల్ల కొడుకులాగే పెరుగుతూ వచ్చింది. ఆ రాజు యొక్క మంత్రికూతుర్ని నేను. నా పేరు యశోవతి. మేమిద్దరమూ ఒకే ఈడు వాళ్ళం. అందుచేత రాజు నన్ను తన కూతురికి ప్రియసఖిగా నియమించాడు. మేమిద్దరమూ ఎంతో సఖ్యంగా ఆడుకుంటూ ఉండేవాళ్ళం. రాజకుమార్తెకు పద్మాలంటే అమిత ఇష్టం. అందుచేత ఆమె రోజూ నన్నూ, ఇతర చెలికత్తెలనూ వెంట బెట్టుకుని, గంగానదిలో పద్మాలుండే చోట జలక్రీడలాడటానికి వెళ్ళేది. అంత దూరం పోవద్దని నేను ఎంత చెప్పినా వినేదికాదు. అందుచేత నేను ఆమెకుగల ఈ అలవాటు గురించి ఆమె తండ్రికి చెప్పాను. అప్పుడు రభ్యమహారాజు తన నగరంలోనే అనేక పద్మాల కొలనులు నిర్మింపజేసి, తన కుమార్తెతో, 'అమ్మా, నీకు పద్మాల నీటిలో క్రీడించాలనిపిస్తే, వీటిలో జలకాలాడు. అంతేకాని ఇంకెక్కడికీ వెళ్ళకు,' అన్నాడు.

కాని ఆమె దూరప్రదేశాలకు వెళ్ళటం మానలేదు. అందుచేత రాజు ఆమె కోసం సాయుధభటుల రక్షణ ఏర్పాటు చేశాడు. ఆమె రోజూ తండ్రితో చెప్పి, నన్నూ, ఇతర చెలికత్తెలనూ వెంట బెట్టుకుని, గంగానదికి వస్తూండేది. ఇలా ఉండగా ఒకనాడు ఉదయం మేము మామూలు ప్రకారం ఇక్కడికి వచ్చాం. మా కన్న ముందే రతీదేవి, అప్సరసలతో వచ్చి, ఇక్కడ జలక్రీడలాడుతున్నది. నా సఖి వారితోకలిసి ఆడసాగింది.

ఇంతలో కాలకేతు డనే రాక్షసుడు రాక్షసపరివారంతో ఇటుగా వచ్చి, నా సఖి ఏకావళిని చూసి, ఆమెను ఎత్తుకుపోయే ఉద్దేశంతో సమీపించాడు. నేను అది చూసి, ఎవడో రాక్షసుడు వస్తున్నాడని గట్టిగా కేక పెట్టాను. అప్పుడు నా సఖి తిరిగి చూసి, రాక్షసుడికి భయపడి, పరిగెత్తుకుంటూ వచ్చి, మా అందరి చెలికత్తెల మధ్యా దాగింది. తరవాత కాలకేతుడు తన గదతో మా సాయుధ సైనికులందరినీ తరిమికొట్టి, జగన్మోహిని అయిన నా సఖిని తీసుకుపోసాగాడు. నా సఖి భయంతో ఏడవసాగింది. నేను చేసేది ఏమీ లేక, ఆ రాక్షసుడితో, 'ఆమెను వదిలిపెట్టు. కావాలంటే నన్ను తీసుకుపో,' అని ఎంతగానో వేడుకున్నాను. వాడు నా మాటలు వినిపించుకోక, ఆమెను తీసుకుని బయలుదేరాడు. నేను కూడా ఏడుస్తూ





వాడి వెంట వెళ్ళాను. నన్ను చూసి ఏకావళి కొంచెం స్వస్థురాలయింది. ఆమె నన్ను కౌగలించుకుని ఏడుస్తూండడం చూసి, కాలకేతుడు తన నగరం చూపించి, 'నా నగరం స్వర్గానికి తీసిపోదు. నీ సఖికి ధైర్యంకలిగేలాగ చెప్పు. నేను తనకు దాసుడుగా ఉంటాను. మీరు నిశ్చింతగా ఉండండి,' అని నాతో అని, నన్ను కూడా ఏకావళితోబాటు రథం మీద ఎక్కించుకుని, వేగంగా తన నగరానికి చేరాడు. అక్కడ ఒక తెల్లని ఇంట మా కిద్దరికీ బస ఏర్పాటయింది. దాని చుట్టూ విచ్చుకత్తులు పట్టిన రాక్షసులు కాపలా ఉన్నారు.

రాక్షసుడు మర్నాడు వచ్చి, నాతో, 'ఎలాగైనా నీ సఖి నన్ను పెళ్ళాడేలాగు చెయ్యి. నా రాజ్యానికి తానే అధికారిణి అని చెప్పు. నేను తనకు సేవకుడుగా ఉండి, ఏ కోరిక కోరినా సరే, తప్పక తీర్చుతాను,' అన్నాడు.

అంటే నేను, 'నీ కోరిక తీర్చే సామర్థ్యం నాకు లేదు. అందుచేత, నువే ఆమెతో మాట్లాడుకో,' అన్నాను. అప్పుడు కాలకేతుడు నా సఖితో, 'నేను నీ దాసుణ్ణి. నన్ను అనుగ్రహించు. నీ యౌవనం శాశ్వతం కాదు,' అన్నాడు.

దానికి నా సఖి, 'నా తండ్రి నన్ను ఒక రాజకుమారుడికి ఇద్దా మనుకుంటున్నాడు. నేను హైహయుడనే రాజకుమారుణ్ణి వరించాను. అందుచేత ఇంకొకరికి ఎలా భార్యను కాగలను? కన్యలు తల్లిదండ్రులు చెప్పినవాణ్ణి పెళ్ళాడాలి తప్ప, స్వతంత్రలు కారు గదా!' అన్నది.

అయినా ఆ దుర్మార్గుడు తన పట్టు వదలలేదు. వాడి పురం పాతాళగర్భంలో, రాక్షసుల రక్షణలో ఉన్నది. అక్కడికి ఎవరూ వెళ్ళలేరు.

యశోవతి చెప్పిన ఈ కథ అంతా విని, ఏకవీరుడు, ''రాక్షసుడు నిన్నూ, నీ సఖినీ తన పురంలో ఉంచాడన్నావు గదా, నువు



ఎలా ఇక్కడికి రాగలిగావు ? హైహయుణ్ణి మీ సఖి ప్రేమించినట్టు చెప్పావు. నేను తప్ప హైహయు డనేవాడు మరెవడూ లేడు. మీ రాజుగారు నా కియ్యటానికే ఈ పిల్లను కన్నాడా? సంకోచం లేకుండా చెప్పు. అదే అయే మాటైతే, ఆ రాక్షసుణ్ణి చంపి నీ సఖిని తెస్తాను. అక్కడికి దారి చెప్పు. ఇంతకూ తన కూతుర్ని రాక్షసుడు హరించిన సంగతి రాజుకు తెలుసా? తెలిస్తే ఆమెను రక్షించే ప్రయత్నం చేయకుండా ఉంటాడా? ఆయన బొత్తిగా అసమర్థుడా?'' అన్నాడు.

దానికి యశోవతి ఇలా అన్నది: ''చిన్నతనంలో ఒక సిద్ధుడు నా కొక మంత్రం చెప్పాడు. నేనా రాక్షసుడి పట్టణంలో ఉండగా నాకు ఆ మంత్రం జ్ఞాపకం వచ్చింది ఆ మంత్రంతో దేవిని ఆరాధిస్తే ముక్తి లభిస్తుందనుకుని ఆ మంత్రం జపించాను. ఎర్రటి బట్టలు ధరించి ఆ దేవి నాకు కలలో కనిపించి, 'నువు వెంటనే లేచి, గంగకు వెళ్ళిపో. నీకు రాక్షసుడి భయం వద్దు. అక్కడికి నా భక్తుడైన హైహయుడు వస్తాడు. అతను నిన్ను చూసి, రాక్షసుణ్ణి చంపి, ఏకావళిని చెర విడిపిస్తాడు. తరవాత వారిద్దరికీ నువు పెళ్ళి చెయ్యి,' అని చెప్పి, అంతర్ధానమయింది.

నేను దేవి మాటలకు పరమానందం చెంది, నిద్రలేచి, ఏకావళికి ఈ సంగతి చెప్పాను. ఆమె ఎంతో సంతోషించింది. నేను ఆ పరాశక్తి దయవల్ల ఇలా వచ్చాను,'' అన్నది.

''లక్ష్మీదేవి నాకు తల్లి. నేను హైహయుణ్ణి. నన్ను 'ఏకవీరుడు' అంటారు. నీ సఖి అందం గురించి వింటేనే నాకు ఆమెపై మోహం కలిగింది. ఆమె నన్ను ప్రేమించిందని నువు చెప్పగానే నేనామెకు దాసుణ్ణి అయాను! నీ ఋణం ఎలా తీర్చుకుంటాను? నీ సఖి ఉన్న చోటికి ఎలా వెళతాను?'' అని ఏకవీరుడు అడిగాడు.

''రాజా, నీకు మంత్రం చెబుతాను. దాని సహాయంతో రాక్షసనగరానికి వెళ్ళి, కాలకేత రాక్షసుణ్ణి చంపి, రాజకుమార్తెను తీసుకురా,'' అని యశోవతి త్రిలోకతిలకం అనే మంత్రాన్ని అతనికి ఉపదేశించింది.

దాని సహాయంతో ఏకవీరుడు యశోవతినీ, తన సేననూ వెంటబెట్టుకుని రాక్షసుడి పురానికి వెళ్ళాడు. పెద్ద సేన వస్తున్నదని దూతలు కాలకేతుడికి చెప్పారు.

కాలకేతుడికి ఈ వార్త వినగానే కోపంతో ఒళ్ళుతెలియకుండాపోయింది. వాడు ఏకావళి దగ్గిరికి పోయి, ''సేనతో వస్తున్నవాడు నీ తండ్రి అయితే ఎదురువెళ్ళి స్వాగతం చెబుతాను. మరొకడు అయేమాటైతే తక్షణం చంపేస్తాను. చెప్పు, ఎవడా వచ్చేది?'' అన్నాడు.

''నీ నిర్బంధంలో ఉన్న నాకు ఎవరు వచ్చేదీ ఎలా తెలుస్తుంది? నా తండ్రి గాని, అన్న గాని కాదని నిశ్చయంగా చెప్పవచ్చు. ఎవరైనప్పటికీ, ఆ బలశాలి ఎందుకు వస్తున్నాడనేదే నా సందేహం,' అన్నది ఏకావళి.

ఇంతలో దూతలు వచ్చి కాలకేతుణ్ణి యుద్ధానికి సిద్ధంకమ్మని హెచ్చరించారు. కాలకేతుడు రథమెక్కి వెళ్ళాడు. ఏకవీరుడు గుర్రం మీద అతనితో యుద్ధానికి తలపడ్డాడు. యుద్ధం ఘోరంగా జరిగింది. త్వరలోనే కాలకేతుడు ఏకవీరుడి చేతిలో చచ్చాడు. వాడి సేనలు చెల్లాచెదరై పోయాయి.

యశోవతి వెళ్ళి ఏకావళికి ఈ వార్త చెప్పింది. ఇద్దరూ కలిసి ఏకవీరుడి శిబిరానికి వచ్చారు. తరవాత అందరూ కలిసి ఏకావళి తండ్రి నగరానికి వెళ్ళారు. అక్కడ ఏకవీరుడికీ, ఏకావళికీ వైభవంగా వివాహం జరిగింది. తరవాత ఏకవీరుడు భార్యాసమేతంగా తన నగరానికి వెళ్ళి, సుఖంగా రాజ్యం చేశాడు.

ఏకవీరుడి కొడుకు కృతవీర్యుడు. కృతవీర్యుడి కొడుకు కార్తవీర్యుడు. అలా హైహయవంశం వర్ధిల్లింది.





# పురుషద్వేషిణి

పూర్వం విజయుడనే రాజుకు రత్నావళి అనే కుమార్తె ఉండేది. ఆమె చాలా చిన్న పిల్లగా ఉండగా ఆమె దాది రోజూ ఒక కథ చెప్పేది. ఆ కథ ఏమంటే—

"అనగనగా ఒక అరణ్యంలో ఒక అడవిపావురాల జంట ఉండేది. లేకలేక వాటికి నాలుగు పిల్లలు పుట్టాయి. ఒక నాడు అరణ్యంలో కార్చిచ్చు బయలుదేరి, ఇంకా ఎగరలేని స్థితిలో ఉన్న ఆ పిల్లలను దహించివేసింది. ఇది చూసి ఆడపావురం చాలా దుఃఖించింది. 'నా పిల్లలుపోయాక నేను మాత్రం బతకటం దేనికి? ఆ మంట ల్లోనే పడి ఆత్మహత్య చేసుకుంటాను' అన్నది.

"మగపావురం తాను కూడా ఆత్మహత్య చేసుకుంటానని బయలుదేరింది. కాని సగం దారిలో అది, 'మనం ఆత్మహత్య చేసుకో వద్దు, మనం ఉంటే ఇంకా పిల్లలు కలగవచ్చు. మనమే పోతే ఇంకేముంది?' అన్నది.

"'ఛీ! నీకు పిల్లలుపోయిన విచారమే లేదు. నేను నీ మాట వినను,'' అంటూ ఆడపావురం వొంటరిగా వెళ్ళి మంటల్లో పడి చచ్చిపోయింది. లోకంలో ఎవరి నన్నా నమ్మవచ్చుగాని మగవాళ్ళను నమ్మకూడదు!''

ఈ కథ విని రాజకుమార్తె దాదిని, "చచ్చిపోయినఆడపావురంఏమయింది?" అని అడిగేది.

దాది నవ్వుతూ, ''ఆ పావురమే మా రాజుకారి కడుపున ఇలా పుట్టింది,'' అని రాజకుమార్తెను ముద్దులాడేది.

కొద్దికాలానికి ఆ దాది చనిపోయింది. కాని రాజకుమార్తె, దాది చెప్పిన అడవి పావురాల కథా, మగవారిని నమ్మ రాదనే నీతీ మాత్రం మరిచిపోలేదు.

25 ఏళ్ళనాటి చందమామ కథ



రత్నావళి ఒకనాడు తండ్రితో, "నాన్నా, నా కోసం తోటలో ప్రత్యేకంగా కుటీరం కట్టించు. అందులో నేనూ, నా చెలికత్తెలూ మాత్రం ఉంటాం. అటుకేసి మగపురుగెవరూ రాకుండా కట్టుదిట్టం చేయించు," అన్నది.

"ఇదేమిటి? నేడో రేపో నీ పెళ్ళి చేదామనుకుంటున్నామే?" అన్నాడు తండ్రి.

"ఈ జన్మలో కాదుగదా, వెయ్యి జన్మలెత్తినా నేను పెళ్ళాడేది కల్ల!" అని చెప్పింది రత్నావళి.

కొంతకాలం గడిచింది. దూరదేశం నుంచి ఒక రాజు కొడుకూ, మంత్రి కొడుకూ వచ్చారు. రత్నావళి ఉండే కుటీరం చుట్టూ ఉన్న తోటను చూసి, అక్కడ కాస్సేపు విశ్రాంతి తీసుకుని ముందుకు పోదామని అందులో ప్రవేశించారు.

వారు తోటలోకి అడుగు పెట్టిన క్షణంలోనే, "పొండి, పొండి! ఇక్కడ పురుషులు అడుగు పెట్టరాదు. మీరు పరదేశీయుల్లాగా ఉన్నారు. ఇది మా రాజకుమార్తె రత్నావళీదేవి కుటీరం. ఇక్కడికి పోతుటీగ వచ్చినా మా రాజుగారు తీవ్రంగా దండిస్తారు," అంటూ ఒక దాసీది అరుచుకుంటూ అక్కడికి వచ్చింది.

"మేమేం మీ రత్నావళిని ఎత్తుకుపోతామా?" అన్నాడు రాజకుమారుడు.

"మా దేవిగారికి పురుషుల పొడ కూడా గిట్టదు. తెలిసిందా? వేగిరం వేంచెయ్యండి," అన్నది దాసీది.

ఇద్దరూ తోట లోపలి నుంచి బయటికి వచ్చేశారు.

"మిత్రమా, ఈ పురుషద్వేషిణిని పెళ్ళాడి తీరాలని నా అంతరాత్మ చెబుతున్నది. ఏమిటి సాధనం?" అన్నాడు రాజకుమారుడు.

"అసలామె ఎంత అనాకారి మనిషో? నేను విచారించి చూస్తాలే," అన్నాడు మంత్రికుమారుడు.

ఇద్దరూ నేరుగా నగరానికి వెళ్లి పేదరాసి పెద్దమ్మ ఇంట బస ఏర్పరచుకున్నారు.

"అవ్వా, మీ రాజుకూతురికి పురుషద్వేషంట! కురూపి కాదుగద?" అన్నాడు మంత్రికుమారుడు.

"మా రత్నావళి చక్కనిచుక్క కాదూ!" అన్నది పెద్దమ్మ.

"అయితే, ఈ పురుషద్వేషానికి కారణం?" అని అడిగాడు మంత్రి కుమారుడు.

"ఈ సంగతి మళ్లీ ఎక్కడా అనకండి, బాబూ! పరమ రహస్యం. రత్నావళి కిందటి జన్మలో ఆడపావురం. పెట్టక పెట్టక పిల్లల్ని పెడితే అగ్నిదేవుడు పొట్టన పెట్టుకున్నాడు. ఆడపావురమూ, మగ పావురమూ కలిసి ఆత్మహత్య చేసుకుందామనుకున్నాయి. ఆఖరు క్షణంలో మగ పావురం ఎటో తప్పించుకు పారిపోయింది. ఆడపావురం మంటల్లో పడి చనిపోయి, మా రాజు కడుపున పుట్టింది." అన్నది పేదరాసి పెద్దమ్మ.

"ఈ రహస్యం ఎవరు కనిపెట్టారవ్వా?" అని అడిగాడు మంత్రికొడుకు.

"అయ్యో, నాయనా! రత్నావళికి పూర్వజన్మ జ్ఞానం ఉంది." అన్నది అవ్వ.



"ఓహో, అలాగా?" అంటూ మంత్రి కుమారుడు కర్తవ్యం ఆలోచించాడు.

మర్నాడు తెల్లవారుతూనే రాజు కొడుకూ, మంత్రికొడుకూ పేదరాసి పెద్దమ్మ దగ్గిర సెలవు పుచ్చుకుని బయలుదేరారు. వారు ఊరి బయటిదాకా వెళ్ళి అక్కడ వేషాలు మార్చుకుని తిరిగి వచ్చారు. రాజుగారి ఆస్థానానికి నేరుగా వెళ్ళారు.

"మీరెవరు? ఏ దేశంవారు?" అని రాజు మామూలు ప్రశ్నలు వేశాడు.

"మహారాజా, మాది నేపాళం. వీరు నా గురువుగారు. ఇంద్రజాలంలో ప్రపంచంలో వీరికి సాటి ఎవరూ లేరు. వీరు



జల స్తంభన, వాయు స్తంభన, అగ్ని స్తంభన వగైరా విద్యలన్నీ చూపిస్తారు. ఎడారిలో మహారణ్యాలు పుట్టిస్తారు. ఎండిపోయిన చెట్లమీద పళ్లు పండిస్తారు. తమరు మెచ్చి తగిన బహుమానం ఇవ్వాలి,'' అన్నాడు మంత్రికుమారుడు.

''మంచిది. ఈ ప్రదర్శనాన్ని తోటలో వున్న కుటీరం వద్ద ఏర్పాటు చేస్తాం. మా అమ్మాయి కూడా చూస్తుంది,'' అన్నాడు రాజు.

మంత్రికుమారుడు ఆందోళన అభినయిస్తూ, ''మహారాజా, వద్దు! మా గురువుగారు స్త్రీ ద్వేషి, ఆడవారిని చూడరు. మీ బహుమానం లేకపోయినా మానె. ప్రతభంగం కావటానికి ఎంత మాత్రం వీలులేదు,'' అన్నాడు.

''ఓహో, అలాగా? పోనీ, స్త్రీ జనం రహస్యంగా కూచుని అయినా ప్రదర్శనం చూడవచ్చునా?'' అన్నాడు రాజు.

''వారు కనిపించరాదు, వారి గొంతు వినిపించరాదు,'' అన్నాడు మంత్రి కుమారుడు.

ఆ ప్రకారమే ఏర్పాట్లు జరిగాయి. తోటలోని ఆవరణలో స్త్రీలకు ప్రత్యేక స్థలం ఏర్పాటుచేసి, స్త్రీలు కనిపించకుండా తెరలు కట్టారు.

ఇంద్రజాలం ప్రారంభించటానికి రాజు కొడుకు లేచి నిలబడి ఇలా చెప్పసాగాడు:

''నా విద్యలను స్త్రీలు సరిగా చూడలేకపోతే ఏలినవారు నన్ను మన్నించాలి. నాకు గల స్త్రీద్వేషానికి కారణం చెబుతాను. నాకు పూర్వజన్మజ్ఞానం ఉన్నది. నేను కిందటి జన్మలో ఒక అడవిపావురాన్ని. నేనూ, నా భార్యా ఎంతో అన్యోన్యంగా ఉండేవాళ్ళం. మాకు లేక లేక పిల్లలు కలిగితే అగ్నిదేవుడు వాటిని పొట్టను పెట్టుకున్నాడు. నేనూ, నా భార్యా ఆత్మహత్య చేసుకుందా మనుకున్నాం. ఆఖరు క్షణంలో నా భార్య ఎటో వెళ్ళిపోయింది. నేను మాత్రం స్త్రీలను ఏ జన్మలోనూ నమ్మరాదనుకుంటూ అగ్నిలో పడి

ప్రాణాలర్పించి, ఆ పుణ్యం ఫలితంగా ఈ జన్మలో ఇంద్రజాల విద్యతో పుట్టాను. జన్మ జన్మాలకూ నా భార్యకు వివాహం ఉండదు. ఇదే ఆమెకు నా శాపం! నేను కూడా స్త్రీని ద్వేషిస్తాను."

ఇదంతా వింటున్న రత్నావళి తెర తోసుకుని ముందుకు వచ్చి, "అబద్ధం, పచ్చి అబద్ధం! సంతాన శోకంతో మరణించింది నేను! నువే ఎటో ఎగిరి పోయావు!" అన్నది.

"నేనా? నేను మరుక్షణమే మంటలలో పడిపోయాను. నన్ను మోసగించినది నువ్వే!" అన్నాడు రాజకుమారుడు.

"మనం బతికుంటే మళ్ళీ పిల్లలు పుడతారన్నావు. నువే మోసగాడివి." అన్నది రాజుకూతురు.

"నీ దీక్ష పరీక్షించటాని కలా అన్నాను గాని, భగవంతుడికి పిల్లల నివ్వాలనే ఉంటే కలిగిన పిల్లలను మంటలపాలు చేస్తాడా? నువే మోసగత్తెవు! నేనా మాట అనగానే నువు మరొక దిక్కుగా పారి పోయి ప్రాణం రక్షించుకున్నావు." అన్నాడు రాజుకొడుకు కోపం నటిస్తూ.

"అయిందేదో అయిపోయింది! గురూ, మీరు మీ భార్యను క్షమించి ఏలుకోండి. మిమ్మల్ని ఆ పరమేశ్వరుడే కలిపాడని మేమంతా అనుకుంటున్నాం," అన్నాడు మంత్రికుమారుడు.

రాజకుమారుడు ప్రసన్నుడై రత్నావళిని సమీపించి, "నేను నీకు అన్యాయం చేసివుంటే క్షమించు. నువు మంటలలో దూకలేదనుకున్నాను," అన్నాడు.

"నేనే పాపిష్టిదాన్ని! నన్ను చావ నిచ్చి మీరు తప్పించుకు పోయారను కున్నాను. నన్నే మీరు క్షమించాలి," అన్నది రత్నావళి.

చివరకు రాజకుమారుడు చేసిన ఇంద్రజాలం రత్నావళి యొక్క పురుష ద్వేషాన్ని పోగొట్టటమే! ఇందుకు బహుమానంగా రాజు అతనికి రత్నావళి నిచ్చి ఒక శుభముహూర్తాన వైభవంగా పెళ్ళి చేసేశాడు.



## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 25 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1980 ఆగస్టు నెల సంచికలో ప్రకటింపబడును.







Subhash G. Shenoy — Prabhakar Mahadik

★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకు సంబంధం ఉండాలి.)

★ జూన్ నెల 20-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంతమాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రూ. 25/—లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, (వ్యాఖ్యలకు సంబంధించని ఇతర విషయాలేవీ చేర్చరాదు.) ఈ అడ్రసుకు పంపాలి :—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26.

## ఏప్రిల్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : వదండి, ముందుకు వదండి

రెండవ ఫోటో : పోదాము, పోదాము పైపైకి

పంపినవారు : జి. కృష్ణ, న్యూ టౌన్, అనంతపురం.

బహుమతి మొత్తం రు. 25/—ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) 188, Arcot Road, Madras-600 026 (India). Controlling Editor: NAGI REDDI.

# శత్రు సంహారం!


































గట్టి పళ్ళకోసం, పిప్పిపళ్ళు రాకుండా నిరోధించడంకోసం—బినాకా ఫ్లోరైడ్.

# చందాదారులకు గమనిక

'చందమామ' కాపీలు పంపుటకు మీ చిరునామాలో ఏదైనా మార్పుంటే 5-వ తేది లోగానే, మీ చందా నంబరు ఉదహరిస్తూ మాకు తెలపాలి, ఆలస్యమైతే మళ్ళీ నెల వరకు మీ క్రొత్త అడ్రసును అమలు పెట్టడానికి వీలుండదు.

డాల్టన్ ఏజన్సీస్
'చందమామ బిల్డింగ్స్'
మదరాసు - 26

CHANDAMAMA (Telugu) JUNE 1980 Regd. No. M. 4854

# రామ్ శ్యామ్

పిల్లల్ని ఎత్తుకుపోయే వాణ్ణి పట్టేసారు!

ఓ సాయంత్రం తిరుగుతుండగా సంతబజారుల్లో
ఓ పెద్ద కేక వినిపించింది వారికి ఆ దగ్గరలో!

రక్షించండి!

"రామ్, శ్యామ్ త్వరగా పద
పరుగు పరుగున, ఎవరో
పడినట్లున్నారు ఇబ్బంది ఇరుకున."

"అదిగో, మాడు ఎలా
పారిపోతున్నాడో
దొంగ,
ఎత్తుకు పోతున్నాడు
శారదక్క
కొడుకును
ఆ ద్రోహి."

"రాయిక్కోసం వెతికితే
వీలులేదిట్ట,
పాపిన్స్‌తోనే
కొట్టి పారేస్తా నేనిక.

"అవిగో పాపిన్స్ సాగాయి అమితవేగంగా
ఆహా హా! తగలాల్సినచోట తగిలాయి మహాగట్టిగా

ఆ ఎత్తుకుపోయినవాడు పడ్డాడు
అదిగో అలా, బాబు ఎక్కేసాడు
వాళ్ళమ్మచంక ఇదిగో ఇలా!

ఆ, ఆనందమానందం తిరిగొచ్చెనే
ఈ పాపిన్స్‌తో బలే మజా కలిసొచ్చెనే!